Photo by Ravinder Kumar Paul



బహుమతి
పొందిన వ్యాఖ్య

బాపనయ్యా చేతుల్లో నీళ్లు ఎందుకో...

పంపినవారు:
S. H. స్వామి - వేజండ్ల

# చందమామ

ఈ సంచికలో కథలు
వింతలు - విశేషాలు

★



ఇవి గాక :
చిత్రకథ, ఫొటో శీర్షికల పోటీ
మొదలైన మరి ఎన్నో
ఆకర్షణలు.



# తీసుకోండి

శ్రేష్ఠమైన కోకో గింజలు, కరద చక్కెర,
అత్యధికంగా గడ్డపాలుతో
తయారుచేయబడినవి,
నోట్లో వేయగానే కరిగి
పోవునట్లు అతి సన్నని
అణువుగాగుండ చేయ
బడినవి. ఎరుపు, బంగారు
రంగుల లేబెల్ తో చుట్టబడినవి.




# మీ




సమృద్ధిగా పాల చాకొలెట్ లో
పొదుగబడిన తేలికైన
రేకువంటి క్రీమ్ వేఫర్లు,
ప్రతివారూ కోరునట్టివి.
చోకో వేఫర్ అనుపేరు
జ్ఞాపకముంచుకోండి.
ఎరుపు, తెలుపు రంగుల
లేబెల్ తో చుట్టబడినవి.

# ఎన్నికైనవి

అసలైన చాకొలెట్ రుచికి పేరుకు
తగినట్లు సూపర్ బ్లెండ్ చాకొలెట్
దివ్యమైనది. అంతర్దేశీయ
బ్రాండ్ కోకోగింజలు
మరియు కండ చక్కెరతో
తయారుచేయబడిన
సూపర్ బ్లెండ్, అమోఘమైన
సువాసన. సమృద్ధిగా
పరిపక్వమైన రుచికరమైనవి. నీలం
మరియు వెండి లేబెల్ తో చుట్టబడినవి.




Heros-113. TEL

# ఇవి మీకోసం తయారు చేయబడినవి!




## ఎక్కడ లైఫ్‌బాయ్ ఉన్నదో
## అక్కడ ఆరోగ్యము వున్నది!

ఆహా, లైఫ్‌బాయ్‌తో స్నానం, ఆనందదాయకం! దాని హాయిగొలిపే అనుభవాన్ని ... పులకింపజేసే ఆరోగ్యకర స్పర్శను మీరు ఇష్టపడతారు! ఆటలోనైనా, పనిలోనైనా మురికి అంటకుండా ఎవరూ తప్పించుకోలేరు. లైఫ్‌బాయ్‌యొక్క సమృద్ధయిన నురగ మురికిలోని క్రిములను కడిగివేసి మీ ఆరోగ్యాన్ని కాపాడుతుంది. మీ కుటుంబములో అందరూ వేటిమంచి లైఫ్‌బాయ్‌ని వాడుట మంచిది కాదా!

హిందుస్థాన్ లీవర్ ఉత్పత్తి

L. 16-X29 TL

# "సరోజ హక్కు"

"మా అన్నయ్యను వదిన సరోజ సహా సాగనంపి ఇంటికి వచ్చాం. వాడుక చీర మార్చ దానికి ధరించియున్న ఆ మెరిసే చీర విప్పబోతూ, దాని కాంతికి విస్తుపోయాను. ఆ చీర, సరోజను, ఆమె మా యింట్లో వున్నవారం రోజులూ ఇంటినెలా వుంచుకోవాలో ఇంటి పనుల నెలా సమర్థించుకోవాలో నేర్పిన ప్రాముఖ్యతను జ్ఞప్తికి తెచ్చింది. మా వదిన వెళ్లేముందు"......

*　　*　　*　　*　　*

"...... ఆ సమయంలో నారవికెకు నప్పేచీరకోసం ట్రంకంతా గాలించాను. మా అన్నయ్య నా కోసం తెచ్చిన 'పులిచారల' చీర తప్ప మరేదీ దొరకలా. ఐతే దాన్ని విసర్జిం చేశాను. తుదకు నాకు నచ్చిన బెంగుళూరంచుగల లక్క రంగు చీర చేతికందింది. కాని దాన్ని విప్పగానే నిర్ఘాంత పోయాను — మధ్యలో జానెడు చిరుగుంది. నా మంచి చీరలన్నీ మాసి పోయాయి. ఇప్పుడేది కట్టుకోవాలి? ఆ భయంకర పులి చారలదా? హాస్యాస్పదమే!" అని నిట్టూర్పు విడిచాను.





"దానిలో నాకేమీ చెరుపనిపించ లేదు విమలా! నేను ఎన్నుకున్న జతలో అదొకటి." అన్నది మా వదిన.

"నా కదంతా తెలీదు. ఇంక మీదట, నేను ధరించుకొనే వాటిని ఇతరులు ఎన్నుట వొప్పు కోను," అన్నాను.

సరోజ ఇలా పరిహసించింది: "విమలా నీకు పెళ్లయ్యాక మీ ఆయన కుతూహలంతో నీకో చీర ఎన్ని తెచ్చినా.......

"తప్పకుండా వద్దంటా; నేను ధరించాలిసింది ఎన్నుకొనే నిర్వివాదనీయమైన హక్కు నాదే."

"అది నిజమే నేను వొప్పుకున్నా. ఎన్నుకొనే హక్కు నీదే; వాటిని కాపాడుకొనే హక్కో మరి!" అన్నదామె.

"అదేమిటీ?" నా బుర్ర తిరిగిపోయింది.

ఆమె ఇలా జవాబిచ్చింది:

"ఔను, ఉదాహరణగా, నీవి అనుకొనే బట్టలకోసం నీ కిష్టమైన సబ్బును వాడి వాటిని సరియైన విధానమున ఉతుక్కొనే నీ హక్కును అమలు జరుపు కొంటున్నావా? నీకు ప్రీతైన లక్కరంగు చీర సంగతి చూడు, నీవు సరియైన సబ్బుతో సరియైన విధానమున

S/P. 6A-50 TL

ఉతుక్కొని యుంటే నీ బట్టలను కాపాడుకొని యుందువు గదా!"

"బట్టను కాపాడే సబ్బు ఏమిటి?

"మంచి సబ్బు అంటే శుద్ధమైనది. సమృద్ధియగు గుణవంతమైన నురగను గలిగించు వట్టిది—బాధకుండానే బట్టలోని మురికిని బాగుగా తొలగింప గలుగునట్టి నురగ. అటువంటి సబ్బు సన్‌లైట్, అది బట్టలను చిరిగిపోకుండా చాలా కాలము మన్నునట్లు కాపాడగలదు." అన్నదామె.

దాంతో నాకిలా తోచింది: "నా హక్కు. నేను ధరించే బట్టలు నాకిష్టమైన రకము. నేత బద్దింపు. రంగువి ఎన్నుకొనుటలోనే గాక వాటిని కాపాడుకొనుటలోనూ వున్నది కూడాను. నేను ధరించే బట్టలకోసం ఏ సబ్బును వాడాలో నేను గాకుండా మరెవరో నిర్ణయించుట దారుణమే! నిజంగా ఇది విపరీతం!"

నేను నిర్ఘాంత పోయినుంచుంటే మా వదిన చిరునవ్వుతో ఇలా అన్నది: "చింతించకు విమలా! నీకా 'పులిచారల' నమూనా నచ్చకపోతే ఆ బీరువాలో వున్న మూటలో నుంచి నీ కిష్టమైంది ఎన్నుకో"

"ఆ బీరువా చూడగానే విస్తుపోయాను. నా మాసిన బట్టలన్నీ మెరిసే తెల్లని కాంతివైన





దొంతరగా తయారై వున్నాయి!"

సరోజ అన్నది గదా. "మాసిన బట్టలు ప్రయాణంలో దగ్గిరుంచుకోవడం నాకయిష్టం. నిన్న నా బట్టలుతుక్కొనేటప్పుడు నీవికూడా ఉతికాను!".......

* * * * *

....... ఎంతో ఋణపడ్డానే అను ఆశ్చర్యానందభావాలతో. ధరించిన ఆ మెరిసే చీర విప్పలేక నుంచున్నాను. స్టేషన్‌లోంచి రైలు కదిలినప్పుడు ఆమె ఉత్సాహంతో ఊపిన ఆ మెరిసే తెల్లని చేతిరుమాల కళ్లల్లో మెదులుతోంది. ఆకాంతి నిలవుండిపోయింది: అది బీరువాయందలి బట్టల మీద, నేను కట్టుకున్న చీర మీద, నా హృదయంలోను మిలమిల్లాడుతున్నది."

సరోజ తన వస్తువులను పెట్టుకుంటూండే బీరువా మీద ఖాళీస్థలంలో చూస్తే నలుపలకల వస్తువొకటుంది, అది సన్‌లైట్ సబ్బుబిళ్ళే నా? నిస్సంశయంగా అదే! నిజంగా అన్ని ఎక్కువ బట్టలను ఉతికే సబ్బు ఇంకేదీ వుండదనుకుంటాను. అది సమృద్ధయిన నురగను గలిగించుననియు, కొద్ది సన్‌లైట్ చాలా బట్టలను తెల్లగాను కాంతిగాను బాదకుండానే ఉతుకునని. ఈ బిళ్ల బోధించుచున్నది. "అందు చేతనే పొదుపును గలిగించుచూ బట్టలు చాలా కాలము మన్నగలవు.




S/P. 6B-50 TL

బొంబాయిలోని హిందుస్థాన్ లీవర్ లిమిటెడ్ వారి ఉత్పత్తి

# ఇప్పుడు
## మీకు ప్రియమైన
## ఆరోగ్యముచేకూర్చే
# విటమినులు కలిసిన
# వాటర్‌బరీస్ కాంపౌండ్
# తీసుకోండి

భారతదేశమందు మిక్కిలి ప్రియమగు, అమూల్యమైన విటమినులతో కూడిన టానిక్కును మీరు యిప్పుడు కొనగలరు. ప్రఖ్యాతి గాంచిన వాటర్‌బరీస్ కాంపౌండ్ ఫార్ములాలో ఆరోగ్యమును, పుష్టిని కలిగించెడు అనేక విటమినుల చేర్పబడినవి. వాటర్‌బరీస్ విటమిన్ కాంపౌండ్ మీకు అనేక విధములుగా మేలు కలుగజేయును. ఇది రక్తమును వృద్ధిచేసి, కోల్పోయిన శక్తిని మరల చేకూర్చి, మీకు ఉత్సాహము నిచ్చును. ఇది నరములకు సత్తువ కలుగజేసి కండరముల అభివృద్ధికి తోడ్పడుటయేగాక వ్యాధులను కూడా నిరోధించును. జబ్బు చేసిన తరువాత త్వరగా స్వస్థత పొందుటకు యిది చాలా సహాయపడును.




## వాటర్‌బరీస్
విటమిన్
## కాంపౌండ్

మీ ఆహార పోషణను పూర్తిచేయును.

దగ్గు, జలుబులకు క్రియోసోట్ మరియు గ్వైకాల్‌తో కూడిన వాటర్‌బరీస్ కాంపౌండ్ ఎఱ్ఱ లేబిల్ గల సీసాలో కూడా లభించుచున్నది.





మీ

పాపాయికి

ఇష్టం

## స్పెన్సర్స్ గ్రైప్ సిరప్

పసిపిల్లల సమస్తమైన అజీర్ణ వ్యాధులకు




స్పెన్సర్ & కో. లి.,
మద్రాసు, బొంబాయి, కలకత్తా, ఢిల్లి
మరియు బ్రాంచీలు

---





సంపూర్ణ శిరోజ పోషకము మరియు శిరోజాలను నలుపు చేయునది మనోహర సువాసన గలది

ఆధునిక విజ్ఞానం మరియు
బాహుళ్యమైన అనుభవం
ఈ రెండింటి సమ్మిళితం

# లోమ

REGD.



లోమ, ఆధునిక విజ్ఞానం మరియు బాహుళ్యమైన అనుభవం, ఈ రెండింటి సమ్మిళితమైన అత్యధిక పరిశోధన యొక్క ఉత్పత్తి. ఇదే దాని విజయవంతమైన ఫలితమునకు రహస్యం.

సోల్ డిస్ట్రిబ్యూటర్స్ అండ్ ఎక్స్‌పోర్టర్స్:
ఎం. ఎం. ఖంబాట్ వాలా,
అహ్మదాబాద్-1

TEL

ప్రతి సోమవారం రాత్రి 8-30 గం॥లకు సిలోన్ రేడియోమీద "లోమా సంగీత్ ఖజానా" వినండి.



राष्ट्रपति भवन,
नई दिल्ली।
जुलाई २२, १९६०
आषाढ़ ३१, १८८२ शक:



"चन्दामामा" के प्रकाशकों को मैं वधाई देता हूं कि वे गत १३ वर्षों से इस वच्चों की पत्रिका का ६ मारतीय माषाओं में प्रकाशन कर रहे हैं, जिनमें हिन्दी के अतिरिक्त मराठी, गुजराती, तेलुगु, कन्नड़ और तमिल शामिल है। कहना न होगा कि हमारे साक्षरता प्रसार की सफलता के लिये यह जरूरी है कि उपयोगी बाल साहित्य प्रकाशित होता रहे। "चन्दामामा" के तरुण पाठकों को मैं प्यार भेजता हूं और इस पत्रिका की सफलता की कामना करता हूं।

राजेन्द्र प्रसाद

ఈ పిల్లల పత్రికను పదమూడేళ్లుగా నిర్వహించుతూ, హిందీతోబాటు మరాఠీ, గుజరాతీ, తెలుగు, కన్నడ, తమిళ భాషలు ఆరింటిలో ప్రకటించుతున్న "చందమామ" ప్రకాశకులకు నా అభినందనలు. అక్షరాస్యతా వ్యాప్తికిగాను ఉపయుక్తమైన బాలసాహిత్యం ప్రచురించుట అవసరమని వేరుగా చెప్పనక్కరలేదు. "చందమామ" చదివే బాలలకు నా ప్రేమను అందజేస్తూ ఈ పత్రికకు విజయం చేకూరాలని ఆకాంక్షిస్తున్నాను.

—రాజేంద్ర ప్రసాద్





# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

ఈ నెల "చందమామ"లో శ్రీహర్షుని నాటక కథ "ప్రియదర్శిక" ప్రచురిస్తున్నాము. క్రీ. శ. 606 నుంచి 647 దాకా మన దేశాన్ని పాలించిన గొప్ప చక్రవర్తి ఈ శ్రీహర్షుడు. చరిత్రలో ఈయన హర్షవర్ధనుడుగా ప్రసిద్ధికెక్కాడు. ఈయన "ప్రియదర్శిక", "నాగానందం", "రత్నావళి" అనే నాటకాలను సంస్కృతంలో రచించాడు. "ప్రియదర్శిక", "రత్నావళి" నాటకాలలో ఉదయనుడూ, వాసవదత్తా ఉంటారు. "నాగానందం"లో బౌద్ధ మతాభిమానం కనిపిస్తుంది.

"అహల్యాబాయి" మనదేశపు చరిత్రకు సంబంధించిన కథ. ఇటువంటి కథలు కొన్ని "చందమామ"లో నెలనెలా వెలువరించ నిశ్చయించాము.

"అనాకారి బాతుపిల్ల" జగత్ప్రఖ్యాతమైన కథ. దీనిని రచించినది హాన్స్ క్రిష్టియన్ ఆండర్సన్ అనే డేనిష్ కథకుడు.

సంపుటి 27 : సెప్టెంబర్ 1960 : సంచిక 3




# మహాభారతం

అర్జునుడి విజృంభణ చూసి దుర్యోధనుడు ఓర్చలేనివాడై, తన సర్వసేనాని అయిన ద్రోణుడి దగ్గిరికి వెళ్లి, "ఆచార్యా, అర్జునుడు మన సేనలను కార్చిచ్చులాగా దహించుకుంటూ సైంధవుడున్న దిక్కుగా వెళుతూ ఉండటం చూశావా?" అన్నాడు.

"వ్యూహముఖంలో చిన్న సందు చూసుకుని కృష్ణుడు అర్జునుడి రథాన్ని నా పక్కగా తప్పించి ముందుకు తోలుకుపోయాడు. అర్జునుణ్ణి వెంబడించి పట్టుకునే వేగం నాకు లేదు. అదీగాక పాండవయోధులు వ్యూహముఖానికి వచ్చి ఉన్నారు. నేను వారినుంచి వ్యూహాన్ని కాపాడాలి. నీవు అర్జునుణ్ణి నిరపాయంగా ఎదుర్కొనే మార్గం నేను చూస్తాను. నేను నీకొక బంగారు కవచం తొడుగుతాను. అది నీ శరీరంమీద ఉండగా, అర్జునుడు కాడుగదా, దేవేంద్రుడైనా నిన్నేమీ చేయలేడు," అంటూ ద్రోణుడు మంత్రోచ్చాటన చేస్తూ ఒక దివ్యమైన కవచాన్ని దుర్యోధనుడికి తొడిగి, ఆశీర్వదించాడు. దుర్యోధనుడు ఆ కవచం ధరించి బోలెడంత సైన్యాన్ని వెంటబెట్టుకుని అర్జునుడున్న చోటికి వెళ్ళాడు.

సాయంకాలం కావస్తున్నది. ఇంకా అర్జునుడు సైంధవుణ్ణి చేరుకోలేదు. ఒక చెంప అర్జునుడు తన బాణాలతో సైన్యాలను సంహరిస్తూ ఉంటే ఇంకొక చెంప కృష్ణుడు రథాన్ని వాయువేగంతో ముందుకు నడుపుకుపోతున్నాడు. గుర్రాలు బాణాల దెబ్బలు తినీ, మెలికలు తిరుగుతూ నడిచీ, చచ్చిపోయిన పీనుగుల గుట్టలమీదిగా పరిగెత్తి ఆకలిదప్పులతో డస్సి, కదలలేని స్థితికి వచ్చాయి. ఆ అదను చూసుకుని కౌరవ సేనలు ఉత్సాహంతో అర్జునుడిపైకి అన్ని వైపులనుంచీ వచ్చాయి. అర్జునుడు ఒక వంక తన బాణాలతో ఆ సైన్యాన్ని సమీ



పానికి రాకుండా చూసుకుంటూ, ఒక అస్త్రంతో భూమిని భేదించి ఒక చిన్న సరస్సు ఏర్పాటుచేశాడు, బాణాలతో ఒక ఇల్లులాగా నిర్మించాడు. ఈ విడ్డూరం చూసి శత్రు సైనికులు అద్భుతం చెందుతూండగా కృష్ణుడు తాపీగా రథపు గుర్రాలను విప్పి, వాటికి గుచ్చుకున్న బాణాలు ఉపాయంగా పెరికి, గుర్రాలను నీటిలో కడిగి, వాటిచేత నీరు తాగించి, వాటికి మేత వేసి, మళ్ళీ వాటిని రథానికి పూన్చాడు. ఇంతసేపూ తన చుట్టూ ఉన్న శత్రు సైన్యంతో యుద్ధం చేస్తూ ఉండిన అర్జునుడు రథమెక్కి బయలుదేరాడు.

ఇప్పుడు అర్జునుడి రథం శరవేగంతో కదిలి సైంధవుడున్న చోటికి వెళ్ళింది. అర్జునుడు సైంధవుణ్ణి చూడగానే దుర్యోధనుడి తమ్ములందరూ హాహాకారాలు చేశారు.

ఆ సమయంలో దుర్యోధనుడు కవచం ధరించి ఒంటరిగా అర్జునుడికి ఎదురు వచ్చాడు. ఇద్దరికీ యుద్ధం జరిగింది. దుర్యోధనుడి బాణాలు అర్జునుడి శరీరాన్ని గాయ పరిచాయి గాని, అర్జునుడి బాణం ఒక్కటీ దుర్యోధనుడి కవచాన్ని ఛేదించలేక పోయింది. ఇది గమనించి అర్జునుడు వడి వడిగా దుర్యోధనుడి బాణాన్నీ, గుర్రాలనూ, సారథినీ ధ్వంసంచేసి దుర్యోధనుడి హస్తాలను గాయపరిచాడు.

ఈలోపల ద్రోణుడున్న చోట కూడా ఉభయపక్ష యోధుల మధ్యా తీవ్రంగా యుద్ధం సాగుతున్నది.

భీముడికీ అలంబుసుడనే రాక్షసుడికీ గొప్ప యుద్ధం జరిగింది. మొదట్లో భీముడు మూర్ఛపోయి, తరవాత వాణ్ణి ఓడించేసరికి వాడు పారిపోయాడు. ఆ తరవాత ఘటోత్కచుడికీ, వాడికీ యుద్ధం జరిగింది. ఇద్దరూ రాక్షసులే. ఈ యుద్ధంలో అలంబుసుడు చచ్చిపోయేసరికి పాండవ యోధులు పొందిన ఆనందానికి మేరలేదు.

ఈలోపల ధర్మరాజుకు అర్జునుణ్ణి గురించి బెంగ పట్టుకున్నది. ఆయన సాత్యకితో, "అర్జునుడు ఉదయమనంగా కౌరవ సేన ప్రవేశించాడు, ఇప్పుడు అస్తమయం కావస్తున్నది. కౌరవుల సింహనాదాలు విన వస్తున్నాయి. నీవు కాస్త అర్జునుడికి తోడుగా వెళుదూ!" అన్నాడు. సాత్యకి ధర్మరాజు రక్షణభారం భీముడిపై వేసి, రథంపైన అర్జును డుండే చోటికి బయలుదేరాడు.

ప్రచండ వాయువులాగా సాత్యకి శత్రు సేనలను చెదరగొట్టుకుంటూ ముందుకు పోతూండగా ద్రోణుడు అడ్డుపడి, "ఏమోయీ, నీచుడిలాగా నీ గురువు అర్జునుడు నాతో యుద్ధంచెయ్యటానికి బదులు నాకు ప్రదక్షిణం చేసి ముందుకు సాగిపోయాడు. నీవుకూడా అదే పని చెయ్యి. లేకపోతే నీ ప్రాణాలు దక్కవు!" అన్నాడు.

"బ్రాహ్మణోత్తమా, గురువు చూపించిన మార్గం శిష్యుడు అవలంబించటమే ధర్మం గదా! నన్ను వెళ్ళనివ్వండి!" అంటూ సాత్యకి ఆయనను తప్పుకుని ముందుకు పోయాడు. ద్రోణుడు తన సేనను కృతవర్మకు అప్పగించి సాత్యకిని వెన్నాడాడు.

ద్రోణుడు తనను చేరవచ్చేలోగా సాత్యకి ఒక గజ సైన్యాన్ని ఎదుర్కొని నాశనం చేశాడు, మగధ దేశానికి చెందిన జలసంధుడనేవాడితో యుద్ధంచేసి వాణ్ణి చంపేశాడు. ఇంతలో ద్రోణుడూ, దుస్సహుడూ, వికర్ణుడూ, చిత్రసేనుడూ, వివింశతీ, దుర్మర్షణుడూ, సత్యవ్రతుడూ మొదలుగాగల కౌరవ యోధులు సాత్యకిని చుట్టుముట్టి యుద్ధం చేశారు. సాత్యకి అందరితోనూ పోట్లాడి అందరినీ దెబ్బతీశాడు. తరవాత దుర్యోధనుడు వచ్చి సాత్యకితో యుద్ధం చేసి దెబ్బతిని నిష్క్రమించాడు. ఇంతలో కృతవర్మ వచ్చాడు. ఇద్దరూ కొంతసేపు ఘోరంగా పోరాడినాక కృతవర్మ శరీరమంతా నెత్తురుమయమై రథంనుంచి కింద పడిపోయాడు.





# క్షీరసాగర మథనము

తృతీయాశ్వాసము :

ఈ విధముగ వారందఱు
ఏడు దీవులను దాటిరి,
మేరు శిఖరమునకు చేరి
క్షీరాబ్ధిని పొడగాంచిరి.

తెల్లని ఆ పాలవెల్లి
ఱెల్లు విరిసినట్లుండెను;
తెలి మబ్బులు మొత్తములై
దిగి వచ్చినయట్లుండెను.

అవలి యొడ్డు కానరాని
అంతులేని పాలవెల్లి,
నురుగులతో తరగలతో
పొరలి పొర్లి పడుచుండెను.

"ఏమయ్యా దేవేంద్రా!
ఈ సంద్రము చిలుకుటెట్లు?
ఎంత పెద్ద కొండైనను
ఇందడుగున పడిపోవును!

కడలిని మథియించుటకును
కవ్వమొకటి కావలెగద!
ఏమందువు?" అని దైత్యులు
ఇంద్రు నడుగ సాగినారు.

"మందరమను పర్వత మది
మంచుకొండకన్న మిన్న;
దాని నిటకు మోసి తెచ్చి
త్రచ్చ వలయు సందరమును.

మన మందఱ మచటి కేగి
మందరమును గొని తెత్తము,
రా రం"డని దేవేంద్రుడు
వారినెల్ల పిలిచినాడు.

మందరగిరి గొనితెచ్చుట
మా వంతని మా వంతని
జబ్బ చఱచి దైతేయులు
చయ్యన అటకేగినారు.

ఉత్పల సత్యనారాయణాచార్య



మందరగిరి ఆకసమును
అందుకొనెడు నట్లుండెను;
కట్టెదుటను నున్నవారి
గొట్టవచ్చు నట్లుండెను.

దైతేయులు మందరగిరి
తామొక్కరు పెఱుకదలచి,
అటు పట్టిరి, ఇటు పట్టిరి—
అంగుళమది కదలలేదు!

మేని కినుక పూసికొనిరి,
మీసములను మెలివేసిరి,
అటు పట్టిరి, ఇటు పట్టిరి—
అంగుళమది కదలలేదు!

దేవత లటు పట్టుకొనిరి,
దితి సుతు లిటు పట్టుకొనిరి;
అప్పటికిని ఆ పర్వత
మావంతయు కదలలేదు;

దేవత లట చతికిలబడి
దిగులుతోడ కూర్చుండిరి;
వగపుతోడ దైతేయులు
మొగమెత్తగ లేకుండిరి.

అపు డచటి కొక బలాఢ్యు
డరుదెంచుట కనిపించెను;
కైలాసపు శిఖర మటకు
కదలి వచ్చె ననిపించెను.

అతని కొక వేయి పడగ;
లా పడగల పైన మణులు!—
ధగధగమని మెఱయుచుండె!
భగభగమని మండుచుండె!

వారందఱు అతనికడకు
చేరి మ్రొక్కి నిలిచినారు;
అతని బుసబుస్సులకే
అల్లలాడి పోయినారు!

"ఓ మహాత్మ! నీ వెవరవో
మే మెఱుగము; మా కోసము
భగవంతుడు మిమ్మిచటికి
పంపెనంచు భావింతుము!

మందరమును పాలసంద్ర
మందున పడవేయవలయు!
ఓ మహాత్మ! అట్లొనర్చు
సామర్థ్యము నీకె కలదు!

నీ శక్తిని వర్ణింపగ
ఆ శేషునికైన తరమె?"
అని యింద్రుడు ప్రార్థింపగ,
అతడు నవ్వి యిట్టులనెను:

"నేనే ఆ శేషుండను—
నెఱవేర్తును మీ కార్యము;
మందరమును చూపించుడు,
సందరమున పడవైతును!"

అని సంతట వారందఱు
ఆనందము పొందినారు;
మందరగిరికా మహాత్ము
నందఱు గొని పోయినారు.

శేషుని గని మందర గిరి
శిర మొగ్గిన యట్లుండెను;
పసిబాలుని కడనుండిన
ఇసుక గూడు లాగుండెను.

శేషుడంత మందర గిరి
చివర వఱకు చుట్టచుట్టి,
ఫెళఫెళ మన నొక్కసారి
పెల్లగించి పడద్రోసెను!



దానిక్రింద పడి కొందఱు
దైత్యులు మరణించినారు;
తక్కిన వా రింద్రునిపై
అక్కసు వెలి గ్రక్కినారు.

అంతటనా యాదిశేషు
డా కొండను సంద్రమునకు
దొర్లించుచు, పొర్లించుచు
తోడి తెచ్చి యిట్లడిగెను:

"ఇంద్రా! ఈ కొండతోడ
ఏమిచేయ దలచినావు?"
అని యడిగిన శేషునకును
అతడిట్లు చెప్పినాడు:

"ఈ కొండను కవ్వముగా
ఏర్పరించి చిలికినచో
అమృత మిందు పుట్టగలదు—
అది త్రాగిన చావుండదు!"

ఆ మాటను విని శేషుడు
"ఐన కవ్వమునకు త్రాడు
ఏది?" అనుచు ప్రశ్నించెను;
ఇంద్రుం డాలోచించెను—

"స్వామీ! ఆ భారమ్మును
తామే వహియింపవలయు,"
అని యింద్రుడు ప్రార్థింపగ,
ఆదిశేషు డిట్లనియెను:

"దేవేంద్రా! నా కించుక
తీఱుపాటు లేదిప్పుడు—
నా తమ్ముడు వాసుకి యను
నాగరాజు కలడొక్కడు.

అతని కిది నచ్చచెప్పి,
అమృతమందు భాగమిచ్చి,
మీ పని నెఱవేర్చుకొనుడు—
మేలయ్యెడుగాత మీకు!"

అని శేషుడు చెరచెర చని
అంతలోన మాయమయ్యె—
ఇంద్రాదులు వాసుకి కొఱ
కేగినారు పాతాళము.

ఇంద్రుని గని నాగేంద్రుడు
ఎంతయొ సంతోషించెను;
మన మిద్దఱ మింద్రులమని
మైత్రిని గావించుకొనెను.

అమృత విషయమపు డింద్రుడు
అతని చెవిని వేసినాడు;
వాసుకి పెల్లుబ్బిపోయి
వారి వెంట వచ్చినాడు. —(సశేషం)






## 9

[రాజకుమార్తె కాంతిమతి చిత్రసేనుడితో తన తండ్రి కపిలపురం కోటలో బంధించబడి వున్నాడని చెప్పింది. చిత్రసేనుడు సైన్యాలతో అక్కడికి వెళ్ళేసరికి, బురుజులమీద సైనికులూ, కోటమీద రెండు భయంకర పక్షులూ కనిపించినై. వాటిని బెదరకొట్టేందుకు మండుతూన్న కాగడాలు చూపితే చాలు అన్నాడు, అమరపాలుడు. తరవాత—]

అమరపాలుడి మాటల్లో చిత్రసేనుడికి పూర్తి విశ్వాసం కలిగింది. అనాటి ఉదయం అతడు స్వయంగా భయంకర పక్షుల కొట్టాలకు నిప్పు పెట్టి, వాటిని సర్వనాశనం చెసి వున్నాడు. కాని, ఉగ్రాక్షుడికి మాత్రం ఆ పక్షులంటే వున్న బెదురు పోలేదు.

"మండుతూన్న కాగడాలు చూపితే, ఆ భయంకర పక్షులు మనమీద దాడి చేయకుండా పారిపోతయ్యా? ఇది నిజమా?" అన్నాడతడు ఎగిరి గంతేస్తూ.

"ఏయ్, కాగడాలూ!" అంటూ అమరపాలుడు కేకపెట్టాడు. ఆ వెంటనే నూనె ఓడుతున్న పెద్దపెద్ద దివిటీలు చేతబట్టుకుని కొందరు సైనికులు ముందుకొచ్చారు.

అమరపాలుడు వాళ్ళను చిత్రసేనుడికి చూపుతూ, "మహారాజా! మీరు అజ్ఞ యిచ్చారంటే, వాటిని వెలిగించి సైనికులు కోటగోడలకేసి నడుస్తారు. వాళ్ళతో కలిసి తతిమ్మా సైన్యం కోటను ముట్టడించవచ్చు," అన్నాడు.




"హేయ్!" అంటూ ఉగ్రాక్షుడు తన రాక్షస బంట్లకేసి చప్పట్లు చరిచాడు. "హెూఁ, మహానాయకా, వచ్చాం, వచ్చాం!" అంటూ రాక్షసులు అన్ని వైపుల నించీ ఉగ్రాక్షుణ్ణి చుట్టుముట్టారు.

"మీలో కొందరు మంచి జవ వున్న మానుల్ని పడగొట్టి, వాటితో కోటద్వారాన్ని ఢీకొట్టి బద్దలుచేయండి. మిగతావాళ్ళు గునపాలు తీసుకుని కోటగోడల్ని పునాదులతో ఎత్తి అవతల వేయండి," అంటూ ఉగ్రాక్షుడు తన సేవకులను ఆజ్ఞాపించి, చిత్రసేనుడితో, "మహారాజా! మనం ఒక్క ముఖద్వారాన్నుంచేకాక, అన్నివైపులనుంచీ కోటలో జొరబడటం మంచిది. కోటలోనూ, బురుజులమీదా వున్న కొద్దిమంది శత్రువులూ అందువల్ల ఒక్కచోటైనా మనను ఎదిరించలేరు. ఇక... ఆ భయంకర పక్షులు మనమీద పడకుండా చూసే బాధ్యత అమరపాలుడిది!" అన్నాడు.

"నువ్వేమీ భయపడకు, ఉగ్రాక్షా! నీ రక్షణభారం నాది," అన్నాడు అమరపాలుడు తన అనుచరులకేసి కన్నుగీటుతూ.

"మానవాధముడివైన నువ్వా, ఈ మహా రాక్షసుణ్ణి రక్షించేది?" అంటూ ఉగ్రాక్షుడు పళ్ళు కొరికి, రాతిగదను పైకెత్తబోయాడు.

"ఆగు, ఉగ్రాక్షా!" అన్నది రాజకుమారి కాంతిమతి ఆజ్ఞాపిస్తున్నదానిలా. "మీరూ మీరూ యిక్కడ దెబ్బలాడి బలాబలాలు తేల్చుకునే లోపల, కోటలో బంధింపబడి వున్న నా తండ్రిగారికి శత్రువులనుంచి అపాయం కలగవొచ్చు. మహారాజా! నాకు సహాయం చేస్తానని మీరు మాట యిచ్చి వున్నారు," అన్నది చిత్రసేనుడితో.

"అవును," అంటూ చిత్రసేనుడు తల వూపి, ఉగ్రాక్షుడితో, "నువ్వు రాక్షసశ్రేష్ఠుడివే, అందులో సందేహంలేదు. నీ ప్రతాపం అమరపాలుడిమీద కాదు చూపించవలసింది, ఆ కోటలో వున్న శత్రువులమీదా,



దానిమీద గస్తీ తిరుగుతున్న భయంకర పక్షులమీదా," అన్నాడు.

చిత్రసేనుడు యిలా అనగానే ఉగ్రాక్షుడు ముఖంలో ఎక్కడ లేని తెగువా, పౌరుషం కనబరుస్తూ, "ఒరే బంట్లూ, ఊఁ!" అన్నాడు అడవి మార్మోగేలా. ఆ వెంటనే రాక్షసులు మానుల్లాంటి చెట్లమీద పడి, వాటిని కూకటివేళ్లతో పెళ్లగించి, కొమ్మలూ రెమ్మలూ చేతులతో దూసేసి, పెద్దపెద్ద బోదెలను భుజాలమీద పెట్టుకొని, రంకెలువేస్తూ కోటగోడలకేసి పరిగెత్తసాగారు. అదే సమయంలో వారికి వెనకగా, చిత్రసేనుడి సైనికులూ, భగభగ మండుతున్న కాగడాలతో కొందరు భటులూ పరిగెత్తారు.

కనుమూసి తెరిచేంతలో కోటప్రాంతమంతా రణగొణ ధ్వనులతో దిమ్మెత్తిపోయింది. చిత్రసేనుడూ, అతడికి వెనకగా కాంతిమతీ సైనికులను ఉత్సాహపరుస్తూ తమతమ అశ్వాలను దూకించారు. ఉగ్రాక్షుడు రాతిగదను గాలిలో వూపుతూ భీకరంగా బొబ్బరిస్తున్నాడు.

సరిగా కోటగోడలు నూరుగజాల దూరంలో వున్నవనగా, కోట బురుజుల మీదినుంచి ఒక్కుమ్మడిగా బాణాలు వర్షాపాతంలా వచ్చి సైనికులమీదా, రాక్షసుల




మీదా పడినై. అదే సమయంలో చిత్రసేనుడి సైనికులలో బాణాలు వదలగలిగినవారు, మోకాళ్ళమీద వంగి గురిచూసి, బురుజుల మీద వున్న శత్రువులమీదికి బాణాలు వదిలారు. ఈ గందరగోళంలో కొందరు రాక్షసులు కోట ద్వారాలను సమీపించి, తమ భుజాలమీద వున్న చెట్టుబోదెలతో తలుపులను ఢీకొట్టసాగారు. మరికొందరు పెద్దపెద్ద గునపాలతో కోటగోడలను పొడిచి బండరాళ్లను బదాబదలు చేయసాగారు.

ఉన్నట్టుండి ఆకాశం ఫెళ్లుమని ఉరిమినట్టయింది. అందరూ నివ్వెరపోయి తేరుకునే లోపల సుడిగాలిలా భయంకర



పక్షులు రెండూ మహావేగంతో సైనికులకేసి రాసాగినై. అమరపాలుడు తన చేతిలో మండుతూన్న కాగడాను పైకెత్తి పక్షులకేసి ఝుళిపిస్తూ, "భయపడకండి! కాగడాలను వాటిమీదికి గురిచేయండి!" అంటూ హెచ్చరించాడు. మరుక్షణమే కాగడాలు మంటలు కక్కుతూ భయంకర పక్షులకేసి లేచినై.

భయంకర పక్షులు చెవులు చిల్లులు పడేలా వికృతంగా అరిచి, సైనికులమీదికి దూకబోయేవల్లా, తిరిగి ఆకాశంలోకి లేచినై. వాటిమీద వున్న పులిరాయుళ్లు తమవద్ద వున్న శూలాలతో వాటి మెడలమీద పొడిచి, అవి సైనికులమీద పడేలా చేసేందుకు



ప్రయత్నించారు. కాని, కింద కాగడా మంటలను చూసిన పక్షులు తమ రౌతుల స్వాధీనం తప్పినై. అందులో ఒకటి రౌతు పొడిచిన శూలం పోటుకు రెచ్చిపోయి ఆకాశంలో తలకిందుగా పల్టీకొట్టింది. పట్టుతప్పిన రౌతు కీచుమంటూ అరిచి, చేతిలో వున్న శూలాన్ని మరింత గట్టిగా గుప్పెట్లో బిగించి పల్టీలు కొడుతూ, అంత ఎత్తునుంచి సైన్యం మధ్య పడిపోయాడు. సైన్యంలో విజయధ్వానాలు మిన్నుముట్టినై. చూస్తూండగానే భయంకర పక్షులు రెండూ ఆకాశంలో మాయమయినై.

భయంకర పక్షుల సహాయాన్ని నమ్ముకుని, అంతవరకూ గుండె దిటవుతో కోట బురుజులమీద నిలబడిన నాగవర్మ సైనికులు, ఒక రౌతు చావటం, పక్షులు పలాయనం కావటం చూస్తూనే, భయకంపితులై కోట బురుజులమీదనుంచి దూకి రాజప్రాసాదంకేసి పరిగెత్తసాగారు. పైనుంచి బాణవర్షం ఆగటంతో చిత్రసేనుడి సైనికులంతా కోట గోడల్ని చేరి క్షణాలమీద కోట తలుపులను బద్దలుకొట్టారు. ఈలోపల గునపాలతో గోడలు బద్దలుకొడుతున్న రాక్షసులు గోడలో ఒకచోట పెద్ద కన్నం చేసి లోపలికి జొరబడ్డారు.




ఆ తరవాత పెద్ద పోరాటం లేకుండానే, రాజప్రాసాదం చిత్రసేనుడి హస్తగతం అయింది. మొండిగా ఎదిరించ పూనుకున్న కొద్దిమంది నాగవర్మ సైనికులను రాక్షసులు రాతిగదలతో దూదికింద ఏకేశారు.

కోటా, అందులోని పెద్ద రాజ ప్రాసాదం చిత్రసేనుడి వశమైనా, రాజు వీరసింహుడు ఎక్కడ బంధించబడివున్నదీ తెలియలేదు. అతణ్ణి ఒకవేళ శత్రువులు రహస్యంగా కోట బయటికి తీసుకుపోయ్యారా అన్న అనుమానంకూడా అతడికి కలిగింది. రాజకుమారి కాంతిమతి మాత్రం తన తండ్రి రాజప్రాసాదంలోని ఏ చీకటికొట్టులోనో



బంధించబడి వుంటాడనీ, సైనికులు జట్లు జట్లుగా వెళ్లి అన్ని గదులూ, భూగృహాలూ, వెదకటం మంచిదనీ చెప్పింది.

ఆ ప్రకారం సైనికులూ, రాక్షసులూ కలిసి రాజప్రాసాదమంతా గాలించసాగారు. చీకటీ, నిశ్శబ్దం గూడు కట్టుకున్నట్టున్న భూగృహాల్లోని ఒకానొక గదినుంచి హఠాత్తుగా మూలుగు వినిపించింది. సైనికులు తమచేత గల దివిటీల వెలుగులో అక్కడికి వెళ్ళి చూశారు. గది అంతా చీకటి మయంగా వుంది. లోపల ప్రవేశించేందుకు వీలు లేకుండా, బయట ఇనప చువ్వల ద్వారం తాళంవేసి వున్నది. చువ్వలలోకుండా దివిటీలను లోపలికి పోనిచ్చి చూసినప్పుడు, ఆ గుడ్డి వెలుగులో ఎక్కడో దూరంగా గోడ నానుకుని ఒక మానవాకారం వున్నట్టు సూచనప్రాయంగా కనిపించింది.

"ఈయనే మహారాజు వీరసింహులు!" అంటూ ఒక సైనికుడు కేకవేశాడు. ఆ వెంటనే ప్రాసాదం అన్నిమూలలనుంచీ సైనికులూ, రాక్షసులూ గుంపులు గుంపులుగా అక్కడికి వచ్చారు. కాని గదిలోపలికి ప్రవేశించేందుకు మాత్రం ఎవరివల్లా కాలేదు. ముందు గదికి వున్న ఇనప చువ్వల తలుపుల తాళాన్ని బద్దలుకొట్టాలి.





సైనికుల కోలాహలం వింటూనే చిత్రసేనుడూ, కాంతిమతీ అక్కడికి వచ్చారు. వాళ్ళకూ దివిటీల వెలుగులో గదిలో ఎవరో వ్యక్తి వున్నట్టు కనబడింది. చిన్నగా మూలుగుకూడా వినబడింది.

"మీరంతా యిక్కడ ఏంచేస్తున్నారు? ముందు తాళం బద్దలుకొట్టండి," అని ఆజ్ఞాపించాడు చిత్రసేనుడు.

సైనికులు గునపాలు తీసుకుని తాళం బద్దలుకొట్టేందుకు ప్రయత్నించారు. కాని పెద్ద కొబ్బరికాయ ప్రమాణంలో తుప్పుపట్టి వున్న ఆ తాళం వాళ్ళ దెబ్బలకు ఖంగు ఖంగుమని ప్రతిధ్వనించిందితప్ప, బెసక లేదు. "తాళం తుప్పపట్టి వున్నది, మహారాజా, చెవి వుంటే బావుణ్ణు!" అన్నాడొక సైనికుడు ఆయాసపడుతూ.

"ఆ తాళంచెవికోసం నువ్వు ద్రోహి నాగవర్మను ఆశ్రయిస్తావా?" అంటూ చిత్రసేనుడు ఆ సైనికుడి చేతినుంచి గునపం తీసుకోబోయేంతలో, పెడబొబ్బలు పెడుతూ ఉగ్రాక్షుడు అక్కడికి వచ్చాడు. అతణ్ణి చూస్తూనే కాంతిమతి, "ఉగ్రాక్షా! నా తండ్రి గారిని శత్రువులు ఈ చీకటి కొట్లో బంధించి వెళ్ళారు. నువ్వు తక్షణం తాళం పగలకొట్టి సహాయపడాలి," అన్నది.




"ఓః అదెంత పని," అంటూ ఉగ్రాక్షుడు సైనికుల్ని నెట్టుకుంటూ ముందుకు వెళ్ళి, తాళాన్ని గుప్పెటతో బిగించి పట్టి గట్టిగా గుంజాడు. అది వూడి రాలేదు. ఈసారి రెండు చేతులతోనూ పట్టి బలంగా లాగాడు. తలుపు చువ్వలు కిరకిరమన్నవిగాని, తాళం అలాగే వుండిపోయింది.

"ఈ నాగవర్మా వాడి భటులూ వింత మనుషుల్లా వున్నారు. తలుపులకంటే తాళం గట్టిది వేసినట్టున్నది!" అంటూ ఉగ్రాక్షుడు రెండు చేతులతోనూ ఇనపచువ్వల్ని పట్టుకుని, బలంగా గుంజేసరికి, అవి మైనపు వత్తుల్లా పక్కలకు వంగిపోయినై. అక్కడ



వీర్పడ్డ ఖాళీలోంచి దివిటీలు పట్టుకున్న సైనికులు దూరి గదిలోపలికి వెళ్ళారు. చూస్తూండగానే దివిటీల వెలుగులో గది గోడలో బిగించివున్న ఇనప కమ్మీలకు గొలుసులతో కాళ్ళూ చేతులూ బంధించివున్న వీరసింహుడు కనిపించాడు. అతడి నోటికి అడ్డంగా ఒక వస్త్రం చుట్టబడి వున్నది. అతడు బాధతో మూలుగుతున్నాడు.

తన తండ్రిని ఆ కష్టస్థితిలో చూస్తూనే కాంతిమతి నిలువెల్లా కంపించిపోయి, "నాన్నా!" అంటూ కేకపెట్టి అతడిదగ్గిరకు పరిగెత్తింది. చిత్రసేనుడుకూడా ఆమె వెంట గదిలో ప్రవేశించి, వీరసింహుడి నోటికి కట్టి వున్న వస్త్రాన్ని విప్పేశాడు. ఈలోపల ఉగ్రాక్షుడు అతడి చేతులకూ, కాళ్ళకూ బిగించివున్న గొలుసులను తెంచేశాడు.

"తల్లీ, నిన్ను తిరిగి ఈ జన్మలో చూస్తాననుకోలేదు," అంటూ వీరసింహుడు నీరసంగా గోడకు చేరగిలబడ్డాడు. ఇంతలో ఒక సైనికుడు మహారాజు కూర్చునేందుకు ఒక ఆసనం తెచ్చాడు, మరొక సైనికుడు దాహం తీర్చుకునేందుకు నీటిపాత్ర అందించాడు.

వీరసింహుడు దాహం తీర్చుకుని సేద దేరి, ఆసనంమీద కూర్చుంటూ కాంతిమతితో, "అమ్మా, ఆ ద్రోహి నాగవర్మ చచ్చాడా, లేక బందీగా చిక్కాడా?" అని అడిగాడు.

కాంతిమతి జవాబు చెప్పబోయి తటపటాయించి చిత్రసేనుడికేసి చూసింది. చిత్రసేనుడు ముందుకు వచ్చి, "మహారాజా! నా పేరు చిత్రసేనుడు. నన్నుగురించీ, నా రాజ్యం గురించీ వినే వుంటారు. ఈ రాక్షసుడి పేరు ఉగ్రాక్షుడు, నా సేవకుడు. నాగవర్మ నా తండ్రిగారిదైన ధవళగిరిరాజ్యం మీదికి దాడి వెళ్ళాడు. అతణ్ణి సాధ్యమైతే దారిలోనే అడ్డగించి హతమార్చేందుకు సైన్యంతో నా సేనానాయకుణ్ణి పంపాను," అని చెప్పాడు. —(ఇంకా వుంది)






# ప్రియదర్శిక

వత్సదేశానికి రాజైన ఉదయనుడు వాసవదత్తను పెళ్ళాడకపూర్వమే దృఢవర్మ అనే రాజు తన కూతురైన ప్రియదర్శికను ఉదయనుడికి ఇస్తానని కబురు పంపాడు. ఈలోపుగా ఉజ్జయిని రాజైన ప్రద్యోత మహాసేనుడు వత్సరాజుకు తన కుమార్తె అయిన వాసవదత్తను ఇచ్చి వివాహం చేసే ఉద్దేశంతో ఒక పన్నాగం పన్నాడు. ఏనుగులను పట్టుకోవటంలో ప్రీతిగల ఉదయనుడు వనంలో ఉండగా ప్రద్యోతుడి సైనికులు ఒక మాయ ఏనుగుతో ఆయనను ఆకర్షించి బందీగా ఉజ్జయినికి పట్టుకుపోయారు.

ప్రియదర్శిక వాసవదత్తకు పరాయిది కాదు, వారిద్దరూ అప్పచెల్లెళ్ల బిడ్డలు, అంటే వేలువిడిచిన అప్పచెల్లెళ్లు. దృఢవర్మ తన కుమార్తె ప్రియదర్శికను వత్సరాజైన ఉదయనుడి కిచ్చి పెళ్ళి చేయలేకపోగా, కళింగరాజుకు కోపం తెప్పించాడు. ఎందుచేతనంటే కళింగరాజు ప్రియదర్శికను తన కిచ్చి వివాహం చెయ్యమని దృఢవర్మను అదివరకే కోరి ఉన్నాడు. ఆమెను తనకు కాదని ఉదయనుడికి ఇవ్వజూపుతాడా అన్న ఆగ్రహంతో ఈ కళింగరాజు దండెత్తి వచ్చి దృఢవర్మ కోటను ముట్టడించాడు. వత్సరాజు ఉదయనుడు తన శత్రువైన ప్రద్యోత మహాసేనుడికి బందీగా చిక్కి ఉన్నాడు గనక ఆయన దృఢవర్మకు సాయం రాడని కళింగరాజుకు తెలుసు.

అయితే దృఢవర్మ భృత్యుడు వినయవసువు అనేవాడు తన ప్రభువు కోరిక ఎప్పటికైనా తీరే అవకాశం ఉంటుందనే ఉద్దేశంతో, ఉపాయంగా కోట లోపలినుంచి ప్రియదర్శికను తప్పించి, ఆమె కళింగరాజుకు చిక్కకుండా తనవెంట తీసుకుపోయాడు. అలా అతను ప్రియదర్శికను తీసుకుని ప్రయాణమై కొంతకాలానికి తన మిత్రుడైన

శ్రీ హర్ష నాటక కథ



వింధ్యకేతుడుండే చోటికి చేరుకున్నాడు. ఈ వింధ్యకేతుడు ఒక అడవిదొర. వినయ వసువు ప్రియదర్శికను అడవిదొర ఇంట ఉంచి కొంతదూరంలో ఉన్న అగస్త్య తీర్థంలో స్నానంచేసి రావటానికి వెళ్ళాడు.

ఇదంతా జరిగేలోపుగా ఉదయనుడు వాసవదత్తను అపహరించి తెచ్చి తన రాజ ధానికి వచ్చి ఆమెను వివాహం చేసుకు న్నాడు. అంతేకాక ఆయన తన శత్రువైన అడవిదొరను జయించటానికి ఒక సేనా పతినీ, కొంత సేననూ పంపాడు. అగస్త్య తీర్థంనుంచి వినయవసువు తిరిగి వచ్చేలోగా ఉదయనుడి సైనికులు అడవిదొరను యుద్ధంలో చంపి, ఆయన ఇళ్ళను దగ్ధం చేసి, అడవిదొర ఇంట ఉన్న ప్రియదర్శిక అడవిదొర కూతురనుకుని ఆమెను వెంట బెట్టుకుని తిరిగి వచ్చారు.

అడవిదొర కుమార్తెను తన సేనానాయ కుడు తెచ్చాడని విని ఉదయనుడు ఆమెను చూడకుండానే, తన భార్య అయిన వాసవ దత్త వద్ద చెలికత్తెగా ఉంచమని అజ్ఞాపిం చాడు. ఇంతలో ఆయనకు దృఢవర్మ వార్త తెలిసింది. ఆయన కళింగరాజుకు బందీగా చిక్కాడు. వాసవదత్త మూలంగా తనకు బంధువైన దృఢవర్మను చెర విడిపించమని ఆయన తన సేనానాయకుణ్ణి తిరిగి పంపాడు.

ఇప్పుడు ప్రియదర్శిక అరణ్యిక అనే పేరుతో వాసవదత్త వద్ద ఉంటున్నది. వాసవ దత్త ఆమెను గౌరవంగానే చూస్తున్నది. ఇలా ఉండగా ఒకనాడు ఉద్యానవనంలో తలవని తలంపుగా ఉదయనుడూ, ప్రియ దర్శికా ఒకరినొకరు చూసుకోవటం తటస్థిం చింది. ఇద్దరికీ ఒకేసారి పరస్పరం ప్రేమ జనించింది. తన తండ్రి తనకు మంచి భర్తనే ఆలోచించాడని ప్రియదర్శిక సంతో షించింది. తన భార్య అధీనంలో ఉండే ఈ అడవిదొర కూతురుని మళ్ళీ చూడట మెలాగా అని ఉదయనుడు మథనపడ్డాడు.

రాజాంతఃపురంలో ఒక సన్యాసిని ఉంటున్నది. ఆమె వాసవదత్తాపహరణ కథను నాటకంగా రచించింది. ఆ నాటకాన్ని రాణి అయిన వాసవదత్త సమక్షంలో ప్రదర్శించటానికి ప్రయత్నాలు సాగాయి. ఇందులో వాసవదత్త పాత్ర ధరించటానికి ప్రియదర్శిక నియమించబడింది, ఉదయనుడి పాత్రను మనోరమ అనే రాణి చెలికత్తెకు ఇచ్చారు.

మనోరమకు ప్రియదర్శిక ప్రేమ వృత్తాంతమంతా తెలుసును. రాజూ, ప్రియదర్శికా కలుసుకోవటానికి సహాయం చెయ్యటానికికూడా సిద్ధంగానే ఉన్నది. దీనికి తగ్గట్టు రాజు తరఫున విదూషకుడుకూడా ఆమె సాయం కోరాడు.

నాటకం ఆరంభమయింది. ప్రియదర్శిక వాసవదత్త నగలను ధరించి రంగస్థలం మీదికి వచ్చింది. ఆమె అచ్చు వాసవదత్త లాగే ఉన్నది. వారిద్దరూ అప్పచెల్లెళ్ల వరస వాళ్ళే గనక ఇందులో ఆశ్చర్యం లేదు. అయినా వాసవదత్త ప్రియదర్శిక ఎవరో ఎరగదు గనక ఆశ్చర్యపడింది. ఇంతలో ఉదయనుడి పాత్ర రంగస్థలంమీదికి వచ్చింది. ఈసారి వాసవదత్త ఆశ్చర్యంతో ఆగిపోక సంభ్రమంతో లేచి నిలబడి, "జయము మహారాజుగారికి!" అన్నది.





తన కథనే రంగస్థలంమీద చూస్తుంటే వాసవదత్తకు వింత గొల్పింది. కాని కొన్ని విషయాలలో ఆమె అవాస్తవమైన కల్పన గమనించింది. ఉదాహరణకు నాటకంలో వాసవదత్తా, ఉదయనుడూ ఒకే ఆసనంపైన కూచున్నారు. "ఆయన బందీగా ఉండి నాకు వీణ నేర్పవచ్చినప్పుడు మేమిద్దరమూ ఒక ఆసనంపైన ఎన్నడూ కూచోలేదు," అన్నదామె తన పక్కనే ఉన్న యోగినితో. "నాటకంలో కొంత కల్పన ఉంటుంది మరి," అన్నది యోగిని.

వాసవదత్త మాట ఏమైనా ఉదయనుడు ప్రియదర్శికను తన చెంత కూర్చొబెట్టుకుని ఆనందించటమే గాక ఆమె చెయ్యికూడా పట్టుకుని తన్మయత్వం చెందుతున్నాడు.

ఇది చూడగానే వాసవదత్త చివాలున లేచి, "ఇలాటి అబద్ధాలను నేను చూడను!" అంటూ బయలుదేరింది. చిత్రశాల ద్వారం వద్ద నిద్రపోతూ ఆమెకు విదూషకుడు కని పించాడు. వాసవదత్త అతన్ని నిద్రలేపి మహారాజెక్కడ అని అడిగింది. అతడు నిద్రకలతన, "నాటకంలో ఆడుతున్నాడే? ఇంకా ఆట పూర్తికాలేదా?" అని అడిగాడు.

"అయితే మనోరమ ఎక్కడ?" అని వాసవదత్త అడుగుతూండగానే మనోరమ పక్కన ఉన్నవాళ్లు, "మహారాణీ, అది మహారాజు కాదు, మహారాజు పాత్ర మాత్రమే!" అన్నారు.

కాని ఉదయన పాత్రలాగా రంగస్థలం మీదికి వచ్చినది మనోరమ కాదు, ఉదయ నుడే. అయన విదూషకుడితో సహా నేపథ్యం లోకి వెళ్లి మనోరమను మంచి చేసుకుని ఆమె తగిలించుకున్న ఆభరణాలన్నీ తీసు కుని తానే రంగస్థలంమీదికి వచ్చాడు. మనోరమా, విదూషకుడూ ఒకమూలనుంచి నాటకం చూడసాగారు. కాస్సేపటికి విదూ షకుడు నాటకం చూడనని చెప్పి పడుకుని నిద్రపోయాడు.

కనిపించింది. "నువు చాలా బాగా నటించావే!" అన్నది వాసవదత్త వెటకారంగా.

"నేనేంచెయ్యను? నేను రంగస్థలం మీదికి పోబోతూండగా ఈ విదూషకుడు రాహువులాగా అడ్డుపడి, నా అలంకారాలన్నీ తీసుకున్నాడు," అన్నది మనోరమ. ఉదయనుడు వాసవదత్తను క్షమాపణ వేడుకున్నాడు. ఉరుము ఉరిమి మంగలంమీద పడ్డదన్న చందంగా, ఏ పాపమూ ఎరగని ప్రియదర్శికను వాసవదత్త చెరలో పెట్టించింది. ఇంతలో వాసవదత్తకు ఆమె తల్లివద్ద నుంచి జాబు వచ్చింది. అందులో వాసవదత్త పినతల్లి భర్త అయిన దృఢవర్మ కళింగ రాజుకు ఓడి ఒక ఏడాదిగా కారాగృహవాసం చేస్తున్నాడని ఉన్నది. దృఢవర్మ కుమార్తె ప్రియదర్శిక ఏమయినదీ తెలియలేదు. ఈ వార్త విని వాసవదత్త దుఃఖితురాలై ఉండగా ఆరణ్యక ఆత్మహత్య చేసుకోవటానికి విషం తాగినట్టు చెలికత్తెలు వచ్చి చెప్పారు.

వాసవదత్త తాను చేసిన పనికి చాలా నొచ్చుకుని ఆరణ్యకను—అంటే, ప్రియదర్శికను—తానున్న చోటికి తెప్పించింది. ఉదయనుడికి విషాన్ని విరుగుడు చేసే మంత్రం వచ్చును. వాసవదత్తకు ఇప్పుడు ఆరణ్యక తన చెల్లెలైన ప్రియదర్శికేనని కూడా తెలిసిపోయింది.

ఆమె ప్రాణం కాపాడమని వాసవదత్త ఉదయనుణ్ణి వేడుకున్నది.

ఉదయనుడు మరొక శుభవార్తకూడా వాసవదత్తకు తెలియబరిచాడు. ఉదయనుడు పంపిన సేనాపతి కళింగరాజును యుద్ధంలో చంపి దృఢవర్మను విడిపించుకుని అప్పుడే వచ్చాడు.

ఒక్క క్షణంలో వాసవదత్త అశ్రువులు ఆనందబాష్పాలుగా మారాయి. ఆమె తన చేతిమీదుగానే ఉదయనుడికీ, తన చెల్లెలు ప్రియదర్శికకూ వివాహం చేయించింది. అంతా సుఖంగా ఉన్నారు.





# అనాకారి బాతుపిల్ల

ఒక కాలవ పక్కన పొదలలో ఒక బాతు గుడ్లు పెట్టి పొదుగుతూ కూచున్నది. కొద్ది కాలానికి గుడ్లన్నీ "టప్, టప్" అని చిట్లి, ముద్దులొలికే బాతు పిల్లలు బయటికి వచ్చాయి. అయినా బాతుకు పొదిగే పని పూర్తి కాలేదు, ఎందుచేతనంటే ఒక గుడ్డు చిట్లకుండా ఉండిపోయింది. అది మిగిలిన గుడ్లకంటె పెద్దదికూడా నూ. అందుచేత బాతు మళ్ళీ దానిపైన కూర్చున్నది.

ఇంతలో ఒక ముసలి బాతు అటుకేసి వచ్చి, "పిల్లలతో సహా కాలవలోకి వెళ్ళి ఈదక ఇంకా కూర్చునే ఉన్నావేం?" అని అడిగింది. "ఒక్క గుడ్డు దిగబడిపోయింది. ఎంతకూ చిట్లకుండా ఉన్నది," అన్నది తల్లిబాతు.

"ఏదీ చూడనీ?" అన్నది ముసలిబాతు. దిగబడిపోయిన గుడ్డును చూసి ఆ ముసలి బాతు, "ఎబ్బే, ఇది బాతుగుడ్డే కాదు. ఏ టర్కీకోడిదో అయి ఉంటుంది. నేనొక సారి ఇలాగే మోసపోయి టర్కీకోడి పిల్లల్ని పొదిగాను. ఎంత బతిమాలినా అవి నీటికేసి రానేలేదు. నా మాట విని ఆ గుడ్డును అక్కడే వదిలేసి నీ పిల్లల్ని తీసుకుపోయి ఈదించు," అన్నది.

"ఇన్నాళ్లు పొదిగానుకద. ఇంకో రెండు రోజులు పొదిగి చూస్తాను పోనీ!" అన్నది తల్లిబాతు. "అయితే నీయిష్టం!" అంటూ ముసలిబాతు వెళ్ళిపోయింది.

ఎలాగయితేనేం దిగబడిపోయిన గుడ్డు కూడా "టప్" అని చిట్లి అందులోనుంచి ఒక పెద్ద బాతుపిల్ల, అమిత అనాకారిది, బయటికి వచ్చింది. "కొంపతీసి టర్కీకోడి పిల్లే కాబోలు! నీటిలోకి తోస్తే నిజం అదే బయటపడుతుంది!" అనుకున్నది తల్లిబాతు.

హాన్స్ క్రిస్టియన్ ఆండర్సన్



తల్లిబాతు, "బాక్, బాక్" అని అరుస్తూ పెద్ద చప్పుడుతో కాలవలోకి దూకింది. తరవాత బాతుపిల్లలన్నీ ఒకదాని తరవాత ఒకటిగా నీటిలోకి దూకి, మునిగి, మళ్ళీ తేలాయి. అన్నీ ఈదసాగాయి. బూడిద రంగుగా ఉన్న అనాకారి బాతుపిల్లకూడా వాటితోపాటు ఈదింది.

"ఇది నా బిడ్డే—టర్కీకోడి కానేకాదు! ఎంత నేర్పుగా ఈదుతోందో!" అనుకున్నది తల్లిబాతు. ఈదటం అయినాక అది తన పిల్లలన్నిటినీ వెంటబెట్టుకుని బాతుల గుంపులుండే చోటికి పోయింది. "ఛీ, ఛీ! ఇదేం బాతు? ఇంత వికారంగా ఉంది!" అంటూ పిల్ల బాతులన్నీ అనాకారి బాతుపిల్లను పొడిచి హింసపెట్టాయి. తాను అనాకారిదిగా పుట్టినందుకు, పాపం, ఆ బాతుపిల్ల ఎంతో దిగులుపడింది.

రోజులు గడుస్తున్నకొద్దీ దాని బాధ ఎక్కువయిందిగాని తగ్గలేదు. ఆఖరుకు తల్లిబాతు కూడా, "నిన్ను పిల్లి అయినా పట్టుకుపోదేమిటి? ఈ బాతులన్నిటి మధ్యా ఉండకుండా దూరంగా తగలడ్డా బాగుండిపోను!" అంటూ దాన్ని తిట్టిపోసేది.

చివరకు ఒకనాడు అనాకారి బాతుపిల్ల ఆ బాతుల గుంపును వదిలి, ఎగురుకుంటూ బురదనేల ఉండే చోటికి వెళ్ళింది. అక్కడ నీటి మడుగులూ, బురదా జాస్తి. ఆ బురద నేలమీద చిలవపక్షులు తండోపతండాలుగా నివసిస్తున్నాయి.

మన అనాకారి బాతుకూడా వాటితో చేరి, తుంగ మధ్య తాను ఉండటానికి చోటు చూసుకున్నది.

"అబ్బో, ఇంత వికారంగా ఎట్లా పుట్టావు నువు?" అన్నాయి చిలవలు బాతుపిల్లతో. అయితే అవి దాని జోలికి రాలేదు.

రెండు రోజులు గడిచినాక మూడోనాడు వేటగాళ్ళు వచ్చి, తుపాకులతో చిలవలుండే ప్రాంతాన్ని చుట్టుముట్టి, తుపాకులు పేల్చసాగారు. "తుప్, తుప్!" కొన్ని చిలవలు పడిపోయాయి. మడుగుల్లో నీరు రక్తం



కలిసి ఎర్రగా అయింది. వేటగాళ్ల కుక్కలు వచ్చి పడిపోయిన చిలవలను పట్టుకు పోతున్నాయి.

అనాకారి బాతుపిల్ల, గుండె దడదడ లాడుతూ, తానున్నచోటనే ముడుచుకు పడుకున్నది. ఒక వేటకుక్క నాలుక బయటికి వేళ్ళాడేసి, కోరలు ప్రదర్శిస్తూ బాతుపిల్ల ఉండే చోటికి వచ్చి, దానికేసి చూసింది; కాని దాని పుణ్యమా అంటూ బాతుపిల్లను తన నోట పట్టుకోకుండానే వెళ్ళిపోయింది.

"అనాకారిదాన్ని కావటం మంచిదే అయింది; కుక్క కూడా నన్ను ముట్టలేదు!" అనుకున్నది బాతుపిల్ల.

సాయంకాలందాకా తుపాకులు పేలాయి. తరవాత వాటి మోత నిలిచిపోయింది. తరవాత చాలాసేపు కదలకుండా ఉండి, చివరకు బాతుపిల్ల ఆ బురదభూమి నుంచి ఎగిరిపోయింది. దారిలో అది వానలో చిక్కుకోవటంచేత దాని ప్రయాణం సరిగా సాగలేదు. చీకటి పడేవేళ అది ఒక రైతు





ఉండే గుడిసె వద్దకు చేరుకున్నది. అంతకంతకూ వాన హెచ్చింది. మన బాతుపిల్ల ఆ వానకు తట్టుకోలేక మెల్లిగా గుడిసెలోకి జొరబడింది.

మర్నాడు ఉదయం రైతు భార్య, తనకున్న పిల్లీ, కోడిపెట్టా కాక, ఒక బాతుకూడా ఏర్పాటుకావటం గమనించి, "అమ్మయ్య, ఇక నేను బాతుగుడ్లుకూడా తినవచ్చు!" అనుకున్నది. ఆ మనిషి మన అనాకారి బాతుపిల్లను మూడువారాలు సాకింది, కాని అది ఒక్క గుడ్డూ పెట్టలేదు. "గుడ్డు పెట్టలేని బాతువు, నువు ఏమన్నబాతువు?" అని పిల్లీ, కోడిపెట్టా యెద్దేవా చేశాయి.

"అలా అయితే పోనీ నేను వెళ్ళిపోనా?" అని బాతుపిల్ల అడిగింది.

"ఓ, మహరాజుగా వెళ్ళు!" అన్నాయి పిల్లీ, కోడిపెట్టా.

అది మొదలు అనాకారి బాతుపిల్ల నీటిలో ఈదుతూ, అడుక్కు వెళ్ళి మళ్ళీ పైకి తేలుతూ నిశ్చింతగా కొంతకాలం జీవిం

చింది. నీటిలో నివసించే ఇతర పక్షులన్నీ దానిని ఎంతో తక్కువగా చూశాయి. అందుకు కారణం అది అనాకారి కావటమే.

ఇంతలో శీతాకాలం వచ్చింది. చలి జాస్తి అయింది. ఎగిరితే ఆకాశంలో గాలికి శరీరం గడ్డకట్టుకుపోతున్నట్టయింది. ఈ చలి మన బాతుపిల్లను చాలా బాధ పెట్టింది. ఒకనాటి సాయంకాలం దానికి ఆకాశంలో ఎగురుతూ ఒక పక్షుల గుంపు కనిపించింది. ఆ పక్షులు చాలా అందంగా ఉన్నాయి. వాటి శరీరాలు కళ్ళు చెదిరేటంత తెలుపుగా ఉన్నాయి వాటి మెడలు చాలా దీర్ఘంగా ఉన్నాయి. అవి హంసలు. అవి చిత్రంగా కేకలు వేసుకుంటూ వెచ్చని ప్రాంతాలకు వెళ్ళిపోయాయి.

వాటిని చూస్తుంటే మన అనాకారి బాతు పిల్లకు ఏదో వింత అయిన భావం కలిగింది. అది వాటిని మరిచిపోలేక పోయింది. వాటి పైన దానికి ఏదో ప్రేమావేశం పుట్టుకొచ్చింది.

అంతకంతకూ చలి ముదిరింది. బాతు పిల్ల ఉండే నీరు చలికి గడ్డకట్టుతున్నది. నీరు గడ్డకట్టకుండా ఉండగలందులకు అది నీటిలో అటూ ఇటూ ఈదవలిసి వచ్చింది. చివరకు బాతుపిల్ల అలిసి కదలలేక పోయింది. దాని కాళ్ళచుట్టూ ఉండే నీరు



గడ్డకట్టిపోయింది. బాతుపిల్ల ఆ మంచులో చిక్కుకుపోయి ఎటూ కదలలేక స్పృహ తప్పిపోయింది.

మర్నాడు ఉదయమే ఎవరో రైతు దాన్ని చూశాడు. వాడు తన కొయ్య చెప్పుతో బాతు చుట్టూ ఉండే మంచును పగలగొట్టి బాతును ఎత్తుకుని తీసుకుపోయి తన భార్య కిచ్చాడు. అప్పటికి దానికి స్పృహ వచ్చింది. రైతు పిల్లలు దాన్ని పట్టుకుని ఆడుకుందా మనే ఉద్దేశంతో దానికేసి పరిగెత్తుతూ వచ్చారు. వారు తనను ఏమిచేసిపోతారో అని భయపడి అది రెక్కలు ఆడిస్తూ అటూ ఇటూ పరిగెత్తి పాలకుండను తోసేసింది, వెన్నదుత్తలో పడింది, పిండిడబ్బాలో పడింది; చివరకు తెరిచిఉన్న వాకిలికుండా బయట మంచులోకి పరిగెత్తి ఏ దుబ్బుల మధ్యనో దాగి పడుకున్నది.

ఆ శీతాకాలం అది పడిన బాధలు మనం ఊహించలేం. క్రమంగా చలి తగ్గిపోయింది. సూర్యుడు మళ్లీ వెచ్చని ఎండ కాయనారంభించాడు. వసంతకాలం వచ్చింది. చెట్ల మీద పక్షులు గొంతులెత్తి శ్రావ్యంగా కూయనారంభించాయి.

మన బాతు రెక్కలు ఆడించి గాలిలోకి లేచింది. దాని రెక్కలిప్పుడు పెద్దవిగానూ, బలంగానూ ఉన్నాయి. అది అలా ఎగిరి



పోయి, పోయి ఒక అందమైన తోటను చేరు కున్నది. అక్కడ పెద్దపెద్ద చెట్లున్నాయి, అందమైన పొదలున్నాయి. పక్కనే కాలవ ప్రవహిస్తున్నది.

మన బాతు చూస్తూండగానే రెక్కలు గలగలలాడించుకుంటూ మూడు తెల్ల హంసలు పొదల మధ్యగా వచ్చి నీటిలోకి దిగి ఈదసాగాయి. వాటినీ, వాటి అందాన్నీ చూస్తే మన బాతుకు గుండె జారిపోయిన ట్టయింది. "ఎంత అందమైన పక్షులు! పక్షులలో రాజులు! బాతులచేత పొడిపించు కునేకన్న వీటి చేతిలో చావు మేలు!" అను కుంటూ మన బాతు గాలిలో ఎగిరి వెళ్ళి నీటిపై వాలి, హంసలకు ఎదురు ఈదు కుంటూ వెళ్లింది. అది వాటిని సమీపించి, "చంపండి!" అంటూ తల వంచింది.

మరుక్షణమే దానికి నీటిలో తన ప్రతి బింబం కనిపించింది. అది నిర్ఘాంత పోయింది! ఎందుకో తెలుసా? అదికూడా ఆ హంసలలాగే ఉన్నది! దాని ఆనందం వర్ణనాతీతం! మిగిలిన హంసలు దాన్ని చుట్టుముట్టి, దాన్ని తమ ముక్కులతో దువ్వాయి.

ఇంతలో కొందరు పిల్లలు తోటలోకి పరి గెత్తుకుంటూ వచ్చారు. వాళ్ళు కొత్తగా వచ్చిన పక్షిని చూసి, కేకలు పెడుతూ, చప్పట్లు చరుస్తూ తమ తల్లిదండ్రులతో, "ఇంకో హంసకూడా వచ్చింది!" అని చెప్పారు. వాళ్ళు రొట్టెలూ, కేక్‌లూ తెచ్చి నీటిలోకి విసిరారు; "కొత్త బుల్లి హంస పాతవాటికన్న ఎంతో బాగుందికదూ!" అన్నారు వాళ్ళు.

"నేను అనాకారి బాతుగా ఉన్నప్పుడు ఇంత ఆనందం నాకు దొరుకుతుందని కలలోకూడా అనుకోలేదుగద!" అను కున్నది ఆ హంస.






# "వీరాధి వీరుడు"

పూర్వం కళింగదేశానికీ వంగదేశానికీ మధ్య ఉండే సరిహద్దులో ఒక కోట ఉండేది. అది చూడటానికి కోటలాగే బురుజులూ, ప్రహరీ గోడలూ కలిగి ఉండేది, కాని నిజంగా సేనలు వచ్చి ముట్టడిస్తే ఎందుకూ పనికిరాదు.

ఈ కోటలో జితవర్మ అని ఒక వెర్రి బాగులవాడు నివసిస్తూ ఉండేవాడు. అతని పూర్వీకులు ఒకప్పుడు రాజ్యాలు ఏలారు. అందుచేత తానుకూడా ఒక మహావీరుడినని జితవర్మ అనుకుంటూ ఉండేవాడు. "మనని చూస్తే ఎటువంటివాళ్ళకూ గుండె దడ! అందుచేతనే మన కోటపైకి ఎవరూ దండెత్తిరారు! అర్జునుడూ, కర్ణుడూ ఏకమై వచ్చినా నా ధాటికి తట్టుకోలేరు!" అని జితవర్మ ప్రగల్భాలు పలుకుతూ ఉండేవాడు.

చుట్టుపక్కలవాళ్లు అతని ప్రగల్భాలు నమ్మినట్టు పైకి నటిస్తూ, చాటుగా అతన్ని చూసి నవ్వుకుంటూ ఉండేవాళ్లు.

తన ప్రతాపం రుజువు చెయ్యటానికి జితవర్మ అప్పుడప్పుడూ కొందరు మనుషులను వెంటబెట్టుకుని ఏ జమీందారు ఆస్తిమీదనో పడి దోచుకు రావటానికి ప్రయత్నిస్తూండేవాడు. జితవర్మ ఏ కోడినో, గొర్రెనో ఎత్తుకుపోతే జమీందార్లు లక్ష్యపెట్టేవారుకారు. అంతకంటె పెద్ద దొంగతనానికి పూనుకున్నప్పుడు వారు తమ నౌకర్లను పంపి, జితవర్మనూ, అతని అనుచరులనూ కొట్టించేవారు. అలా దెబ్బలు తిని వచ్చినప్పుడు జితవర్మ, "పిరికిపందలు! ధైర్యం ఉంటే వాళ్లే వచ్చి నాతో ముఖాముఖీ యుద్ధం చెయ్యాలి గాని, తమ వెట్టివాళ్ళను నా మీదికి పంపుతారా? అటువంటి నీచులతో నేను యుద్ధం చేస్తానా?" అనేవాడు.

బందిపోటుకు పోయి జితవర్మ దెబ్బలు తిని వచ్చినప్పుడు అతని భార్య అతని వీపున ఉండే గాయాలకు మందు రాచేది. తన భర్త

వి. సత్యనారాయణ




వెర్రిబాగులవాడని ఆమెకు తెలును; కాని చేసేదేమీ లేదుగనక తన భర్తను ఉబ్బ వేయటానికి, "నీచులు! చూడండి, అన్ని గాయాలూ వీపునే ఉన్నాయి! ధీరులైతే ఎదురుగా వచ్చి కొట్టాలి. అంతేగాని వెనక పోట్లు పొడుస్తారా?" అనేది.

"నా ఎదటికి రావటానికి వాళ్లకు గుండెలున్నాయా?" అనేవాడు జితవర్మ.

ఒకనాటి ఉదయం ఒక వింత జరిగింది. కోటమీది బురుజులో కాపలా కాసే నౌకరు దిగివచ్చి జితవర్మతో, "దొరా, పెద్ద సేన! మన కోట మీదికే వస్తున్నది!" అని రొప్పుతూ చెప్పాడు. జితవర్మ గట్టిగా హుంకరించి బురుజుమీదికి వెళ్ళాడు. కళింగదేశంనుంచి ఒక పెద్ద సేన వస్తూ ఉండటం అతనికి కనిపించింది. ఆ సేనలో రథాలూ, ఏనుగులూ, గుర్రాలూకూడా ఉన్నాయి. కనీసం ఇరవై వేల మంది సైనికులున్నారు.

జితవర్మ తన నౌకర్లనందరినీ పిలిచి, "ఒరే, ఇవాళ మనకు సుదినం. ఈ కళింగులు మన కోటను పట్టుకోవటానికి వస్తున్నారు. నా బాణాలూ, ఈటెలూ, విల్లులూ బురుజులో పెట్టండి. నేను ఒంటరిగా ఈ సేనను నాశనంచేసి విజయలక్ష్మిని వరిస్తాను. కళింగరాజును నా సామంతుణ్ణి చేసేసుకుంటాను. ఏమి వాడి పొగరు! హా!" అని చిందులు తొక్కాడు.

అంత పెద్ద సేన ఈ మారుమూల కోటను ముట్టడించటానికి వస్తున్నదని నౌకర్లు నమ్మలేదు. ఆ సైనికులంతా చేరి తలా ఒక రాయీ పీకినా కోట ఉండదు.

కళింగసేన జితవర్మతో యుద్ధం చెయ్యటానికే వచ్చినట్టు త్వరలోనే స్పష్టమయింది. ఆ సేనలు కోటకు ఒక ఫర్లాంగు దూరంలో వచ్చి నిలబడ్డాయి. సేనాధిపతి గుర్రంమీద కోటను సమీపించి, తల ఎత్తి బురుజులో ఉన్న జితవర్మతో, "ఈ కోటలో ఉండే పరాక్రమశాలి ఎవరు?" అని అడిగాడు.



"వేరే అడగాలా? నేనే!" అన్నాడు జితవర్మ ధీమాగా.

"అయితే వెంటనే మీ కోటను మా వశం చెయ్యండి! లేదా యుద్ధంలో మిమ్మల్నీ, మీ కోటనూ నేలమట్టం చేసేస్తాం! కళింగ దేశపు రాజు ఆజ్ఞపై మేము వంగదేశాన్ని యావత్తూ దిగ్విజయం చేయవచ్చాం!" అన్నాడు కళింగ సేనాధిపతి.

"ఔరా, నీచుడా! ఏమి మీ రాజు కావరము! చూడు, నిన్నూ నీ సేననూ ఇప్పుడే యమలోకానికి పంపుతాను! జితవర్మ పరాక్రమం ఏమిటనుకున్నావు?" అంటూ జితవర్మ శత్రు సేనాధిపతిపైన ఒక బాణం ఎక్కుపెట్టి వదిలాడు. ఆ బాణం సేనాధిపతికి చాలా దూరంలో పడిపోయింది.

సేనాధిపతి సంజ్ఞచేశాడు. కొంత సేన ముందుకు వచ్చి కోటపై బాణాలు వెయ్యనారంభించింది. జితవర్మ తన భటులను హెచ్చరించి, సైనికులపైన బాణాలు కురిపించసాగాడు. అతని బాణాలుగాని, కళింగ సైనికుల బాణాలుగాని ఎవరికీ తగలలేదు, ఏమీ నష్టం కలిగించలేదు.

ఈవిధంగా ఒక అరగంటసేపు యుద్ధం జరిగాక కళింగ సేనలు వెనక్కు తగ్గాయి. "పిరికిపందలు! వెనక్కు వెళ్ళారు! నా ప్రతాపం వాళ్ళెరగరు," అని జితవర్మ తన భటులతో అన్నాడు.

అయితే కళింగ సేనలు పూర్తిగా వెళ్ళిపోలేదు. కోటకు ఒక ఫర్లాంగు దూరంలో వాళ్ళు శిబిరం ఏర్పాటు చేసుకున్నారు. రోజూ ఉదయంపూట ఒక అరగంటా, సాయంకాలంపూట ఒక అరగంటా కొద్దిమంది సైనికులు ముందుకు వచ్చి కోట గోడలకేసి బాణాలు కొట్టి మళ్ళీ వెనక్కు వెళ్ళిపోయేవారు.

ఇలా పదిరోజులు గడిచాక కళింగ సేనాధిపతి తన గుర్రంమీద కోటను సమీపించి, "జితవర్మా, మేము యుద్ధంలో ఓడి

పోయాము. మనం సంధి చేసుకునేటందుకు గాను కోట ద్వారాలు తెరిపించండి!" అని కేకపెట్టాడు.

"ఈ పని మొదటనే చేస్తే మీకూ మాకూ కూడా ఎంతో శ్రమ తప్పేదిగా!" అంటూ జితవర్మ కోట తలుపులు తెరిపించి శత్రు సేనాధిపతిని లోపలికి రానిచ్చాడు.

"ఇకనుంచీ మీ కళింగరాజు నాకు సామంతుడుగా ఉండి కప్పం చెల్లిస్తాడా?" అని జితవర్మ సేనాధిపతిని అడిగాడు.

"అప్పుడే కాదు. ప్రస్తుతానికి మటుకు మా సేనలో సగానికి పైగా యుద్ధంలో చని పోయినట్టూ, మిగతా సగంలో ఒక వంతు మీకు ఖైదీలుగా చిక్కినట్టూ పత్రం రాసి ఇవ్వండి," అన్నాడు కళింగ సేనాధిపతి.

ఆ పత్రం తీసుకుని సేనాధిపతి తన సేనతోసహా వంగరాజు వద్దకు వెళ్ళాడు. అసలు సంగతేమంటే కళింగరాజ్యాన్ని కాజెయ్యటానికిగాను ఒక కుట్ర జరిగింది. వంగరాజ్యాన్ని జయించివస్తానని చెప్పి కళింగ సేనాధిపతి సేనతోసహా వచ్చి సరి హద్దు మీద తనకు కనిపించిన మొదటి కోటవద్ద యుద్ధం చేసినట్టు నాటకం ఆడాడు. తన సేన దాదాపు నాశనమైపోయినట్టు జిత వర్మ దగ్గిర పత్రం పుచ్చుకుని ఆ సైన్యాన్ని వంగరాజు పరంచేసి, తాను కొద్దిమంది సైనికులతో తన దేశానికి తిరిగి వెళ్ళాడు. తరవాత కొద్దికాలానికి వంగ సైన్యాలు కళింగదేశాన్ని ముట్టడించి జయించాయి.

ఇదంతా జితవర్మకుగాని సరిహద్దులో ఉండేవారికిగాని తెలియదు. జితవర్మ యోధానయోధుడనీ, తనపైకి దండెత్తి వచ్చిన కళింగ సేనలను ఒంటరిగా నాశనం చేశాడనీ చెప్పుకున్నారు. జితవర్మకూడా తన వల్లనే కళింగసేన సగంపైగా నాశనమయి నట్టు నమ్మాడు. ఈ యుద్ధాన్ని కళ్ళారా చూసినవారు లేకపోవటంచేత వాస్తవంగా జరిగినదేమిటో ఎవరికీ తెలియదు.





## 6

కుబిలాయ్ ఖాన్ కొలువులో ఉంటూండగా మార్కోపోలో రాచకార్యంపైన పడమటి దిక్కుగా నాలుగు మాసాల ప్రయాణం చెయ్యవలిసివచ్చింది. ఖాన్-బాలిక్ (పీకింగ్) నుంచి బయలుదేరిన మార్కోకు మూడు వారాల ప్రయాణం తరవాత కాయ్-చు దుర్గం తగిలింది. ఈ దుర్గాన్ని పూర్వం బంగారు రాజు అనేవాడు నిర్మించాడు.

బంగారు రాజు శక్తిమంతుడు. ఆయనకు పరిచర్యలు చెయ్యటానికి అందగత్తెలయిన యౌవనవతులు మాత్రమే ఉండేవారట. ఇలాటి యువతులు ఎందరో ఈయన కొలువులో ఉండేవారు. ఈయన తన భవనపు పరిసరాలలో ఒక తేలికైన రథంపై కూచుని, ఆ అమ్మాయిల చేత రథాన్ని లాగించుకుంటూ వాహ్యాళి వెళ్ళేవాడట!

ఈ బంగారు రాజు కావటానికి ఉంగ్ ఖాన్ (ప్రెస్టర్ జాన్) సామంతు; అయినా బలవంతుడననే అహం కొద్దీ ఉంగ్ ఖాన్‌ను ధిక్కరించాడు. ఇద్దరిమధ్యా యుద్ధం జరిగింది. కాని ఈ యుద్ధంలో ఉంగ్ ఖాన్ బంగారు రాజును ఓడించలేకపోయాడు, ఎందుకంటే ఆయిన దుర్గం అభేద్యమైనది.

ఉంగ్ ఖాన్ ఆగ్రహావేశంతో కుమిలిపోసాగాడు. అప్పుడు ఆయన భృత్యులు ఏడుగురు బంగారు రాజును ప్రాణాలతో పట్టి తెచ్చి తమ ప్రభువుకు వప్పగించగల




మని ప్రతిజ్ఞ చేశారు. ఉంగ్ ఖాన్ ఇందుకు ఎంతో సంతోషించి, వారు ఆ పని చేయ గలిగే పక్షంలో వారిని తగినవిధంగా బహూక రిస్తానన్నాడు.

ఆ ఏడుగురూ బయలుదేరివచ్చి బంగారు రాజు కొలువులో ప్రవేశించి రెండేళ్ళపాటు ఆయనకు సమస్తోపచారాలూ శ్రద్ధాభక్తులతో చేసి, ఆయన అనుగ్రహాన్ని పూర్తిగా సంపా దించుకున్నారు. బంగారురాజు వారి యందు ఎంత విశ్వాసం ఉంచాడంటే, తన కొడుకులనుకూడా అంతకంటె విశ్వసించి ఉండడు. తాను వేటకు వెళ్ళినప్పుడల్లా వారిని వెంటబెట్టుకు వెళ్ళేవాడు.



ఒకసారి ఆయన వేటకుపోతూ ఈ ఏడు గురు భృత్యులనూ, కొద్ది పరివారాన్ని వెంట బెట్టుకు వెళ్లాడు. రాజభవనానికి ఒక మైలు దూరంలో వారికొక నది అడ్డువచ్చింది. పరి వారాన్ని నదివద్ద విడిచి రాజూ, ఏడుగురు భృత్యులూ నది దాటారు. ఇటువంటి అవ కాశం కోసమే ఆ ఏడుగురూ కనిపెట్టుకుని ఉన్నారు. ఇప్పుడు బంగారు రాజు వారి అధీనంలో ఉన్నాడు, ఆయనను కాపాడేం దుకు ఒక్క పురుగుకూడా లేదు.

వాళ్ళు కత్తి పిడులపైన చేతులు పెట్టి, "మావెంట వస్తావా? చస్తావా?" అని అడి గారు. రాజు వారి చర్యకు నిర్ఘాంతపోయి, "ఇదేమిటి? నన్ను మీ వెంట ఎక్కడికి రమ్మంటున్నారు?" అని అడిగాడు.

"మా ప్రభువైన ఉంగ్ ఖాన్ వద్దకు!" అని వారు జవాబిచ్చారు.

"నాకింత ద్రోహం ఎలా చెయ్యగలిగారు? నేను మిమ్మల్ని కన్న కొడుకులకన్న ఎక్కువగా చూసుకున్నానే! తిన్న ఇంటి వాసాలు లెక్కించటంకన్న ద్రోహం ఉన్నదా?" అన్నాడు బంగారు రాజు.

"అయితే అయింది!" అంటూ వారు బంగారు రాజును ఉంగ్ ఖాన్ వద్దకు తీసుకుపోయారు.





ఉంగ్ ఖాన్ బంగారు రాజును చూసి, "నువు రావటం నాకు పరమానందంగా ఉంది. నీకు ఎలాటి స్వాగతం లభించేదీ తెలుసా?" అని అడిగాడు.

బంగారు రాజు ఏమనాలో తెలియక మౌనంగా ఉండిపోయాడు. ఉంగ్ ఖాన్ అతడిని పశువుల కాపరిగా నియమించాడు.

పాపం, రెండేళ్ళపాటు బంగారు రాజు పశువుల కాపరిగా పని చేశాడు. అంత కాలమూ ఆయనపై రాజభటులు నిఘా ఉంచారు. రెండేళ్ల అనంతరం ఉంగ్ ఖాన్ ఒకనాడు బంగారు రాజును పిలిపించి, రాజోచితమైన దుస్తులిచ్చి సత్కరించాడు. "నాతో కయ్యానికి కాలు దువ్వటం కూడని పని అని ఇప్పటికైనా తెలిసిందా, మహా రాజా?" అని ఆయన అడిగాడు.

"అవును, ప్రభూ! మిమ్మల్ని ఎదిరించి నిలబడగలవాడెవడూ లేడని నాకు ఎప్పుడూ తెలుసును," అన్నాడు బంగారు రాజు.

"అదే నాకు కావలిసింది," అంటూ ఉంగ్ ఖాన్ బంగారు రాజుకు ఒక గుర్రాన్నీ, కొంత పరవారాన్నీ ఇచ్చి సాగనంపాడు.

* * *

మార్కోపోలోకు తగిలిన మరొక నగరం వోచాన్. దీనిని గురించి కూడా ఒక కథ




ఉన్నది. 1272 కు పూర్వం బెంగాలు బర్మా దేశాలకు ఒక రాజు ఉండేవాడు. ఆయన పెద్దఖానుకు లోబడినవాడు కాడు. వోచాన్‌కు దాడి భయం ఉన్నదని తెలిసి పెద్దఖాన్, నజ్రుద్దీన్ అనే తాతార్ నాయకుడి కింద కొంత సేనను పంపి వోచాన్ వద్ద ఉంచాడు.

ఈ సేనను ఎదిరించి పోరాడటం తన ధర్మంగా భావించి బెంగాలు-బర్మా రాజు అఖండమైన సేనతో బయలుదేరి వచ్చాడు. ఆ సేనలో రెండు వేల అంబారీ ఏనుగులున్నాయి; ఒక్కొక్క అంబారీలోనూ 12 మొదలు 16 మంది దాకా యోధులు ఎక్కారు. ఈ ఏనుగులుగాక ఈ సేనలో

40 వేలమంది యుద్ధ భటులున్నారు. వీరిలో హెచ్చుమంది అశ్వికయోధులు.

ఈ సేనను చూసి నస్రుద్దీన్ నిర్విణ్ణుడయాడు; అతనికింద 12 వేలమంది అశ్విక సైనికులు మాత్రమే ఉన్నారు. అయినా అతను తన సేనలను యుద్ధోన్ముఖం చేసి కాగలదానికి ఎదురు చూస్తూ ఉన్నాడు. బెంగాలు రాజు సేనలు తలపడటంతోనే తాతార్ యుద్ధాశ్వాలు ఏనుగులకు వెరిచి, పరిసరారణ్యాలలోకి పారిపోయాయి.

ఇదీ ఒకవిధంగా మంచిదే అయింది. తాతార్ సైనికులు చెట్లమాటున తమ గుర్రాలనుండి దిగి బెంగాలు - బర్మా సైన్యంపై బాణవర్షం కురిపిస్తూ ఏనుగులను తీవ్రంగా గాయపరిచారు. ఏనుగులు బాధతో ఘీంకరిస్తూ చెల్లాచెదురుగా పరిగెత్తసాగాయి. వాటితోబాటు గుర్రాలుకూడా పరిగెత్తాయి. ఆ క్షణంలోనే తాతార్ సైనికులు తమ గుర్రాలపై లంఘించి వెన్నంటారు.

ఉభయపక్షాలా అంబులు అయిపోయాయి. గదలతోనూ, కత్తులతోనూ దొమ్మి యుద్ధం సాగింది. ఈ యుద్ధంలో రాజు సేనలు చావుదెబ్బ తిన్నాయి. రాజూ, చావగా మిగిలిన యోధులూ పరారీ అయారు. లేక పోతే వారుకూడా ప్రాణాలు కోల్పోయేవారే.

తాతార్‌లు ఏనుగులను పట్టుకుందామని అడవి చెట్లు వాటి దారికి అడ్డంగా పడేశారు, ఇంకా ఎన్నో ప్రయత్నాలు చేశారు. కాని ఈ ప్రయత్నాలన్నీ వ్యర్థమయాయి. చిట్ట చివరకు, యుద్ధఖైదీలుగా చిక్కిన రాజు సైనికులే తాతార్లకు కొన్ని ఏనుగులను పట్టి ఇచ్చారు. ఈవిధంగా తాతార్లకు సుమారు రెండువందల ఏనుగులు దొరికాయి.

అది మొదలు పెద్దఖాను వెంట పుష్కలంగా ఏనుగులుకూడా వుంటూవచ్చాయి.

ఈ యుద్ధం జరిగిన కొద్దికాలానికి బెంగాలు-బర్మా రాజు పెద్దఖాను ఏలుబడిలోకి రావటం జరిగింది. —(ఇంకావుంది)






# జీవితంపైన మమకారం

విసుగుచెందని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవం లోని బేతాళుడు, "రాజా, నీ పట్టుదల నిజంగా సాటిలేనిది. జీవితంపైన ఎంతో ఆశ గలవాళ్లు కూడా తమ ప్రయత్నాలు నిష్ఫల మైతే విరక్తి చెంది ప్రదీపుడిలాగా ఆత్మ హత్మకు పూనుకుంటారుగదా, నీ ప్రయత్నం ఇన్నిసార్లు విఫలమైనా నీకు విసుగు జనిం చక పోవటం అత్యాశ్చర్యకరం. శ్రమ తెలియకుండా ఉండగలందులకు నీకు ప్రదీపుడి కథ చెబుతాను విను!" అంటూ ఈ విధంగా చెప్పసాగాడు:

విదిశానగరంలో ప్రదీపుడనే ఒక యువకు డుండేవాడు. వాడికి తల్లిదండ్రులు చిన్న తనంలోనే పోయారు. తోబుట్టువులు లేరు. ఆఖరుకు దగ్గిర బంధువులుకూడా లేరు. వీటన్నిటికీ తోడు ఇల్లూ వాకిలీ కూడా లేని



కారణంచేత వాడు బుద్ధి తెలిసినప్పటి నుంచీ అనాథగానే ఉంటూ వచ్చాడు. చిన్న తనంలో ఒక గురువును ఆశ్రయించి, వారి ఇంట ఊడిగం చేస్తూ కొద్దిగా చదువు కున్నాడు. అయితే గురుదక్షిణ ఇవ్వలేని ఆ నిర్భాగ్యుడికి గురువు ఏమంత శ్రద్ధగా చదువు చెప్పలేదు, కాని చాకిరిమాత్రం బాగా చేయించుకున్నాడు. వాడికి పదిహేను, పద హారేళ్ళు రాగానే గురువుగారు వాడితో, "ఇక నీవు పెద్దవాడవైనావు. నీకు చెప్పే చదు వంతా అయిపోయింది. ఎక్కడికైనా పోయి, ఎవరినైనా ఆశ్రయించి నీ బతుకు వెళ్ళ బుచ్చుకో!" అని సాగనంపాడు.

ప్రదీపుడు దేశసంచారం ప్రారంభిం చాడు. పక్షులకు గూళ్లూ, ఉడతలకు చెట్ల తొర్రలూ, ఎలుకలకు బొరియలూ ఉన్నాయి గాని వాడికి నిలవ నీడ లేదు. రోజుకొక కొత్త ఊరు వెళ్ళేవాడు. దారిలో పగటి కలలు కనేవాడు: తాను చేరబోయే గ్రామంలో ఎవరో తనను చేరదీస్తారనీ, తనకు అక్కడ జీవనోపాధి లభిస్తుందనీ, తానుకూడా సమాజంలో చేరిపోయి ఇతరు లతో కష్టసుఖాలు చెప్పుకోవటమూ, వారి కష్టసుఖాలు వినటమూ జరుగుతుందనీ ఊహించుకునేవాడు. తీరా ఆ గ్రామం వెళ్ళాక అక్కడ ఎవరూ వాడి విషయం పట్టించుకునేవారు కారు, వాడి మంచి చెడ్డలు విచారించేవారు కారు. ఏ ఇంటనో ముష్టి ఎత్తి ఇంత తిండి తిని, ఏ చెట్టు నీడనో పడుకుని నిద్రపోయేవాడు.

ఈవిధంగా ప్రదీపుడు అయిదారేళ్లపాటు సంచారం చేశాడు. వాడికి సుఖాలు ఎలా ఉంటాయో తెలియదు, అందుచేత తాను కష్టాలు పడుతున్నాననికూడా అనిపించ లేదు. వాడు ఇతరులమధ్య సంబంధ బాంధవ్యాలు గమనించి ప్రపంచంలో నిజ మైన ఆనందం ఒక్కటేనని గ్రహించాడు. అదేమిటంటే, సంతోషం కలిగినా, బాధ



కలిగినా ఆ కలిగినదాన్ని ఇతరులతో పంచుకోవటం. పెద్దపెద్ద ఇళ్ళలో ఉండటమూ, గొప్పగొప్ప దుస్తులు ధరించటమూ, కడుపుకు ఇంత బాగా తినటమూ నిజమైన ఆనందం కాదు. ఆకలి అయినప్పుడు ఏది తిన్నా ఎంతో రుచిగానే ఉంటుందనీ, అలసిపోయినప్పుడు చెట్టుకింద నిద్రపోయినా ప్రాణానికి హాయిగానే ఉంటుందనీ వాడు స్వానుభవంద్వారా తెలుసుకున్నాడు. వాడికి లేనిదల్లా ఒకటే ఆనందం—ఇతరులతో తన భావాలు పంచుకోవటం. ఎక్కడనైనా నలుగురు కూచుని మాట్లాడుకుంటూ నవ్వుకున్నా, విచారం వెలిబుచ్చినా ప్రదీపుడు వారినిచూసి అసూయపడేవాడు. తనకు అటువంటి స్నేహితులూ, బంధువులూ లేనందుకు ఎంతో బాధపడేవాడు.

ఒక్కొక్కప్పుడు వాడికి తన జీవితంపైన విరక్తి కలిగేది. "ఇంత ప్రపంచంలో ప్రతి ప్రాణికీ నా అనే ఇతర ప్రాణులున్నాయి. నేను ఒక్కణ్ణే ఎవరూ లేనివాణ్ణి! నేను బతికిఉండీ చచ్చినవారిలోనే జమ. ఇంతకంటె చచ్చిపోతేనేం? ఎందుకు వచ్చిన తిప్పలు?" అనుకునేవాడు.

లోపల ఆశ అనేది ఉండి వాణ్ణి ఆత్మహత్య అనేది చేసుకోకుండా ఆపింది. ఆ ఆశ




మూలానే వాడు భవిష్యత్తు గురించి కలలు కనేవాడు. ఎప్పటికైనా ఎవరో ఒకరు తనను చేరదీసి తమ ఆప్తవర్గంలో చేర్చుకుంటారని వాడికి వెర్రి నమ్మకం. ఈ నమ్మకంతో వాడు అప్పుడప్పుడూ ఇతరులను ఆప్యాయంగా పలకరించబోయేవాడు. కాని వాడికేసి చూడగానే నవ్వేవాళ్ళు నవ్వటం మానేసేవారు. వాడు సమీపించగానే మాట్లాడేవాళ్ళు మాట్లాడటం మానేసి, "మేమేదో మాట్లాడుకుంటూంటే, పానకంలో పుడకలాగా నువ్వు వచ్చావేమిటి?" అన్నట్టు వాడికేసి చూసేవారు. వాడు ఒక నిట్టూర్పు విడిచి ఇవతలికి వచ్చేసేవాడు.





చిట్టచివరకు వాడికి పగటి కలలు కనే శక్తి కూడా పోయింది. జీవితంమీద విరక్తి కలిగింది. వాడు విరూపానగరంకేసి పోతూ ఒక నదిని చేరి, అందులో పడి ఆత్మహత్య చేసుకోవటానికి నిశ్చయించుకున్నాడు. వర్షాల కారణంగా నది పూటుగా ప్రవహిస్తున్నది. అయినా ప్రదీపుడికి ఈదటం చాత నవును. అందుచేత నదిలో పడి చావటం కూడా అంత తేలికపని కాదు. ప్రదీపుడు నదిలో దూకి, చేతులూ కాళ్ళూ పూర్తిగా బలహీనమైపోయేదాకా ఈది ఆ తరవాత నీటిలో మునిగి చచ్చిపోవటానికి నిశ్చయించుకున్నాడు.

అంతలోనే ప్రదీపుడికి ఒక వింత కనబడింది. ఎవరో యువకుడు నదిలో పడి కొట్టుకువస్తున్నాడు. అతనికి ఈత రాదులాగుంది. తల నీటిపైకి వచ్చినప్పుడల్లా నోటితో గాలి పీల్చి మూలుగుతున్నాడు.

ప్రదీపుడు చప్పున నీటిలోకి దూకి ఆ కొట్టుకువచ్చే యువకుడికేసి బలంగా ఈదుకుంటూ వెళ్ళాడు. ప్రదీపుడు తన శరీరానికి తగలగానే ఆ యువకుడు అతని మెడ గట్టిగా వాటేసుకుని స్పృహ కోల్పోయాడు. వరదలో ఉన్న నదిని ఈ ఒడ్డునుంచి ఆ ఒడ్డుకు అడ్డంగా ఈదేసరికి ప్రదీపుడు చాలా అలిసిపోయాడు. దానికితోడు ఆ యువకుడు అతని మెడకు గుదిబండలాగా అయాడు. అవతలి ఒడ్డు సమీపంలోనే ఉన్నప్పటికీ, ఈది దాన్ని చేరుకోవటం ప్రదీపుడికి ఎంతో దుస్సాధ్యంగా కనబడింది.

ఈ సమయానికి అవతలిఒడ్డు వెంబడి కొందరు మనుషులు పరిగెత్తుకుంటూ వచ్చారు. వాళ్ళు మెల్లిగా ప్రదీపుణ్ణీ, రెండో యువకుణ్ణీ ఒడ్డుకు చేర్చారు. తరవాత వాళ్ళు తమ యజమానిని, "చిన్నబాబూ! చిన్నబాబూ!" అని పిలుస్తూ అతనికి పరిచర్యలు చెయ్యటంలో నిమగ్నులై ప్రదీపుడి విషయం పట్టించుకోలేదు.

ప్రదీపుడికి ఆత్మహత్య చేసుకోవాలన్న కోరిక యావత్తూ అడుగంటిపోయింది. అతనికి జీవితంపై తిరిగి ఆశ కలిగింది. అతను తడి బట్టలతోనే, ఒక కోసు దూరంలో ఉన్న విరూపానగరం చేరుకున్నాడు. వాడు రోజల్లా నగరపు వీధులన్నీ తిరిగి, ఎక్కడో ఇంత తిండి తిని సాయంకాలంవేళకు అంబికాలయం చేరుకున్నాడు.

కొద్దిసేపటికి ఒక కుటుంబం అక్కడికి వచ్చింది. మనుషులనూ, వారు ధరించిన దుస్తులనూ, వారి వెంట ఉన్న నౌకర్లనూ, ఆ నౌకర్లు మోసుకువచ్చిన సామగ్రినీ బట్టి వాళ్లు గొప్ప ఇంటివాళ్లు అయి ఉండాలని ప్రదీపుడు ఊహించుకున్నాడు. ఆ కుటుంబంలో నడివయసు గల ఒక భార్యా, భర్తా, పదహారు పదిహేడేళ్ల వయసు గల కుమార్తె ముగ్గురు నలుగురు చిన్నపిల్లలూ ఉన్నారు. వారివెంట ఆడా మగా నౌకర్లు ఏడెనిమిది మంది పళ్లాలలో కొబ్బరికాయలూ, అరటిపళ్లూ, పూలూ, కుంకమూ, పచ్చకర్పూరమూ మొదలైనవి పట్టుకువచ్చారు.

వారంతా ఆలయంలోకి వెళ్ళారు. లోపలికి వెళ్లాక నౌకర్లు యజమానితో, "మన చిన్నబాబుగార్ని ఈ ఉదయం కాపాడిన మనిషిలాటివాడు బయట మండపంలో కూచుని ఉన్నాడు!" అని చెప్పారు.



యజమాని వారిని వెంటబెట్టుకుని బయటికి వచ్చి, ప్రదీపుణ్ణి సమీపించి, "నాయనా, నీపేరేమిటి? మీదేవూరు?" అని అడిగాడు. వారి సంభాషణవల్ల ప్రదీపుడే ఆ పెద్దమనిషి కుమారుణ్ణి రక్షించినవాడని తేలింది.

"ఇవాళ మావాడికి జలగండం తప్పటం మాకెంత ఆనందంగా ఉందో నువ్వు ఊహించుకోవచ్చు. అందుకే ఈపూట అంబికకు పూజ చేయించటానికి అందరమూ వచ్చాము. నువ్వుకూడా మావెంట రా! మా అబ్బాయి నీకోసం తెగ కలవరిస్తున్నాడు. తాను బతికి, నీవు నదికి బలి అయావేమోననికూడా ఎంతో దిగులుపడుతున్నాడు!" అన్నాడు ఆ పెద్దమనిషి.

ఆయన ప్రదీపుణ్ణి తన ఇంటికి తీసుకుపోవటమే గాక అతనికి తన కుమార్తెనిచ్చి పెళ్ళికూడా చేసి, తన ఇంటనే ఉంచుకున్నాడు. ఈవిధంగా ప్రదీపుడు కనిన పగటి కలలు నిజమయాయి.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, నాకొక్క సందేహం. ప్రదీపుడు ఆ యువకుడి ప్రాణం రక్షించినాక తన ఆత్మహత్యా ప్రయత్నాన్ని ఎందుకు మానుకున్నాడు? అతనికి జీవితంపై తిరిగి ఆశ కలగటానికి కారణమేమిటి? ఈ ప్రశ్నకు సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "పరోపకారం ద్వారా మనిషికీ సమాజానికీ మధ్య బాంధవ్యం పెరుగుతుంది. మరొకరికి ఉపకారం చేసే అవకాశం లేని కారణంచేతనే ప్రదీపుడు జీవితం గురించి కలలు కనే శక్తిని కోల్పోయాడు. ఎప్పుడైతే మరొకరి ప్రాణం కాపాడాడో అప్పుడే అతనికి కలలు కనే శక్తి తిరిగి వచ్చింది," అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతోసహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు. —(కల్పితం)






మహారాష్ట్ర దేశంలోని పాథర్డి గ్రామంలో ఆనందరావు శిందే అనే రైతు ఉండేవాడు. ఆయనకు ఎంతకాలానికీ పిల్లలు కలగలేదు. అయినా, ఆయన భార్యా కలిసి ఎన్నో ఆల యాల చుట్టూ ప్రదక్షిణలు చేశారు, ఎందరో దేవతలకు మొక్కుకున్నారు, ఎన్నో తీర్థ యాత్రలు చేశారు; కాని వారి సంతానవాంఛ తీరనేలేదు. వారికి ప్రాణం విసిగిపోయింది.

ఒకనాడు పాథర్డి గ్రామానికి ఒక సాధువు వచ్చాడు. శిందే దంపతులు ఆయనకు తమ గాథ చెప్పుకున్నారు. కొల్హాపూరులో ఉండే శ్రీ జగదాంబను సేవించినట్టయితే వారి కోరిక ఫలిస్తుందని సాధువు చెప్పాడు. అదే ప్రకారం ఆ దంపతులు ఒక సంవత్సరం పాటు ఆ దేవిని ఎంతో శ్రద్ధాభక్తులతో ఆరాధించారు.

ఒకనాడు రాత్రి దేవి ఆనందరావుకు కలలో కనిపించి, "మీ దంపతుల భక్తికి నేను చాలా సంతోషించాను. నేనే స్వయంగా మీ గర్భవాసాన జన్మించబోతున్నాను," అని చెప్పింది. ఆ రాత్రే ఆనందరావు భార్యకు కూడా ఒక కల వచ్చింది; ఆ కలలో ఎవరో ముత్తయిదు ఒక చంటిబిడ్డను ఆమె చేతు లలో ఉంచి, నుదుట కుంకం పెట్టి అదృ శ్యమై పోయింది.

శిందే దంపతులు పరమానందంతో తమ గ్రామానికి తిరిగి వెళ్లిపోయారు. తర వాత కొద్దికాలానికి—క్రీస్తుశకం 1735 లో— వారికి అహల్యాబాయి జన్మించింది. ఆ బిడ్డ జాతకం చూసినవారందరూ ఆమె రాజపత్ని అవుతుందనీ, దీర్ఘకాలం రాణిగా పరిపాలన చేస్తుందనీ, ఆమె పేరు శాశ్వతంగా నిలిచి పోతుందనీ చెప్పారు.

అహల్య తన బాల్యాన్ని చాలా సుఖంగా గడిపింది. ఆమెకు చదవటమంటే చాలా ఇష్టం, రామాయణ మహాభారతాలంటే




ఎంతో అభిమానం. ఆమె అందగత్తె అని ఎవరూ అనలేదుగాని, ఆమె ప్రవర్తనలో నిండుతనమూ, ఠీవీ, ఇతరుల హృదయాలను చప్పున ఆకట్టుకునే శక్తి అపారంగా ఉండేవి.

అహల్యకు తొమ్మిదేళ్ళు నిండగానే వివాహ ప్రయత్నాలు ప్రారంభించారు. ఆమె జాతకం ఫలిస్తుందేమోనన్న ఆశతో ఆమె తండ్రి అహల్యకు పనికిరాదగినవాడు ఎక్కడైనా ఉన్నాడా అని అడ్డమైన రాజకుటుంబాలన్నిటినీ పరిశోధించాడు; కాని ఒక్క వరుడుకూడా కనిపించలేదు. చివరకు అహల్యా తల్లిదండ్రులు విరక్తిచెంది, జాతకంలో రాసిపెట్టి ఉన్నది ఏదైనప్పటికీ తమ ప్రయత్నం లేకుండానే జరుగుతుందని మనసు రాయి చేసుకున్నారు.

కొంతకాలం గడిచింది. రఘునాథరావూ, దాదాపేష్వా, మల్హారావు హోల్కార్ అనే వారు ఉత్తరదేశంలో యుద్ధాలలో విజయం పొంది స్వదేశానికి తిరిగి వస్తూ పాథర్డి గ్రామంలో తమ సేనలతో మజిలీచేశారు. యుద్ధసమయంలో మహారాష్ట్ర యోధులు విధిగా మారుతికి మొక్కుకుంటారు. శిందే లుండే ఇంటికి ఎదురుగానే ఒక మారుతి ఆలయం ఉన్నది. మల్హారావు ఆ ఆలయానికి వచ్చేసరికి అహల్యాబాయి అక్కడే ఉన్నది. ఆ పిల్లలో కనిపించిన రాజఠీవికి మల్హారావేగాక ఆయన పరివారంకూడా ఆశ్చర్యపోయారు. మల్హారావు ఆ పిల్లను గురించి తెలుసుకోగోరాడు. ఆ సమయంలో అక్కడే ఉండిన అహల్యాబాయి గురువు ఆమె జన్మవృత్తాంతమంతా చెప్పాడు. అంతా శ్రద్ధగా విన్న మల్హారావు, "ఈ పిల్ల నా కొడుకైన ఖండేరావుకు భార్య కాదగినది!" అన్నాడు.

వెంటనే పెళ్ళిమాటలు జరిగాయి. మరునటి మాసంలో అహల్యాబాయికీ ఖండేరావుకూ వైభవంగా వివాహం జరిగింది.




అకస్మాత్తుగా రాజవాసంలో అడుగు పెట్టినప్పటికీ అహల్యా మెట్టినింట ఆదర్శ ప్రాయంగా నడుచుకున్నది. మామ చండ శాసనుడు, అత్తకు రాజసం జాస్తి. అయి నప్పటికీ అహల్యా ఆదర్శ సతీమణుల అడుగుజాడలలో నడుచుకుంటూ, ఎలాటి గూడుపుఠాణీలతోనూ జోక్యం పెట్టుకోక, నిష్కపటంగా ప్రవర్తిస్తూ అందరి మన్న నలూ అందుకోగలిగింది. మామగారైన మల్హారావు ఆమెను పరిపాలనకూ, రాజ్యాం గానికీ సంబంధించిన విషయాలు తెలుసుకో నిచ్చాడు. అయన ఏ యుద్ధానికో దూర ప్రాంతం వెళ్ళినప్పుడు రాచకార్యాలన్నీ ఆమెకు వప్పజెప్పి వెళ్ళేవాడు. ఆమె తన విధులను సమర్థతతో నిర్వర్తించేది.

1754 లో భిల్లులు తిరుగుబాటు చేశారు. ఖండేరావు వారి తిరుగుబాటు అణచటానికి సైన్యంతోసహా వెళ్ళి, యుద్ధంలో మరణిం చాడు. ఇరవైఏళ్ళయినా నిండకుండానే అహల్యా వితంతువు అయిపోయింది. అప్ప టికి ఆమెకు మాలీరావు అనే కుమారుడూ, మచ్చాబాయి అనే కుమార్తె ఉన్నారు.

అహల్యా తన భర్తతోబాటు సహగమనం చేయ నిశ్చయించుకున్నది. కాని ఆమె మామగారైన మల్హారావు ఆ పని తలపెట్ట వద్దని వేడుకున్నాడు. ఆయన అహల్యాతో, "అమ్మా, నాకు నీకన్న మరొక సంతానం లేదు. నీవుకూడా పోతే నేను ఈ వార్ధక్యంలో బొత్తిగా దిక్కులేనివాణ్ణి అయిపోతాను. రాజ్యం అరాజకమైపోతుంది. అందుచేత ఎలాగైనా నీ దుఃఖాన్ని దిగమింగి రాజ్య పాలన చెయ్యి," అన్నాడు.

మల్హారావుకు ఒక పెద్ద కోరిక ఉన్నది; అదేమిటంటే, విస్తృతమైన మహారాష్ట్ర సామ్రాజ్యం భారతమంతటా వ్యవస్థాపన చెయ్యాలని. ఈ ప్రయత్నంలో ఆయన కృతకృత్యుడు అవుతున్నట్టే కనిపించాడు. ఉత్తరదేశం కొంచెం కొంచెమే ఆయన అధీన

మవుతున్నది. ఢిల్లీకూడా ఆయనకు చేజిక్కింది. ఇంతలో, పాపం, ఆయనకు నూరేళ్ళు నిండాయి.

అహల్య కుమారుడైన మాలీరావు ఇందోర్ సింహాసనం ఎక్కాడు. కాని అతను రాజ్యార్హుడు కాడు, క్రూరుడుకూడాను. సింహాసనమెక్కిన తొమ్మిది మాసాలకే అతను మరణించాడు. అతని మరణానికి ఆనందించని వారు లేరు. ఖాళీపడిన సింహాసనంపైన ఎవరు కూర్చోవాలన్న సమస్య ఏర్పడింది. "న్యాయంగానూ, దక్షతతోనూ ప్రజలను నేనే పరిపాలిస్తాను!" అని అహల్యాబాయి ప్రకటించింది.

ఆడది పరిపాలనచేస్తే తాము ఇష్టం వచ్చినట్టు ఆడవచ్చునని రాజోద్యోగులలో కొందరు సంతోషించారు. కాని అహల్యాబాయి మనుషులను ఎంతో చక్కగా అర్థం చేసుకుని అంచనాకట్టగలది. తనను తెగ మెచ్చుకునేవారిపట్ల ఆశ్రిత పక్షపాతం చూపక ప్రతి ఉద్యోగానికీ ఆమె సమర్థులైన వారినే నియమించింది.

ప్రజాపీడకులను దూరంగా ఉంచి, ప్రజాహితం కోరేవారినీ, పరిపాలనా నిర్వహణలో సమర్థత కలవారినీ మాత్రమే తన మంత్రులుగా వేసుకున్నది. అహల్యాబాయి చేసిన ఈ పనివల్ల కుట్రదారుల ఆటకట్టయి



పోయింది. వారు ఆగ్రహావేశులై ఆమె పతనం కోసం కృషిచెయ్య నిశ్చయించారు. ఈ కుట్రదారులకు పెద్ద గంగాధర జస్వంత్ అన్నవాడు. ఈయన రాజ పురోహితుడు. ఆయన రాణితో, "అమ్మా, తమరు మీద వేసుకున్న భారం బహు గొప్పది; అబలలు భరించేది కాదు. నా మాట విని మీ వంశానికి చెందిన కుర్రవాణ్ణిగా చూసి సింహాసనం అధిష్ఠింపజేసి, అతని పేర రాజ్యపాలన చేయటానికి ఒక ప్రతినిధిని నియోగించి, వితంతు స్త్రీలకు ఉచితమైన నిష్ఠలతోనూ, అనుష్ఠానాలతోనూ కాలం వెళ్ళబుచ్చండి," అని సలహా ఇచ్చినట్టుగా చెప్పాడు.

"రాజపత్నినీ, రాజమాతనూ అయి ఉండి నేను నాకన్న ఉన్నత పదవిలో ఉండటానికి ఎవరినో నియమించటం ఎన్నటికీ జరగదు. మతానికి సంబంధించి మీరు ఏ సలహా ఇచ్చినా పాటిస్తాను; కాని రాజకీయాల జోక్యం ఎన్నడూ ఎత్తవద్దు!" అని అహల్య రాజ పురోహితుడికి స్పష్టంగా చెప్పింది. గంగాధర జస్వంత్‌కు ఈ మాటలు శూలాలయాయి. పేష్వా మాధవరావు పినతండ్రి అయిన రాఘోబాకు ఈ రాజ పురోహితుడు, "మా రాజ్యాన్ని మీరు వచ్చి వశపరచుకోండి—ఇక్కడ ఒక ఆడది రాజ్యం చేస్తున్నది!" అని రాశాడు.






రాఘోబా శక్తిమంతుడూ, ఆశాపరుడూనూ. ఆయన కొందరు రాజద్రోహులను కూడగట్టుకుని, వారిచేత అహల్యాబాయికి ఈవిధంగా చెప్పించాడు: "మన రాజ్యాన్ని ఒక వంక రాజపుత్రులూ, మరొక వంక ఇంగ్లీషువారూ కబళించజూస్తున్నారు. వారిని యుద్ధరంగంలో ఎదుర్కోవటం స్త్రీకి సాధ్యమయేపని కాదు. అందుచేత సింహాసనానికి ఒక వారసుణ్ణి, రాజ్యపాలనకు ఒక రాజ ప్రతినిధినీ నిర్ణయించటం అన్నివిధాల క్షేమంగా ఉంటుంది."

అహల్యాబాయి తనకు ఈ సలహా ఇచ్చిన వారితో, "మీ కుట్రలన్నీ నే నెరుగుదును. ఇందుకు మీరు శిక్ష అనుభవించి తీరుతారు. మీ రాణిపట్ల ఎలా ప్రవర్తించాలో అలా ప్రవర్తించండి. మీ బెదిరింపులు నన్ను భయపెట్టలేవు. నేను మీ ఆటలు సాగనివ్వను," అన్నది.

ఈ సంగతి విని రాఘోబా మండిపడ్డాడు. "ఏమి ఈ ఆడకూతురి అహంకారం! ఈవిడ తన మామ మాకు సామంతు అని ఎరగదా? ఈవిడకు సరి అయిన గుణపాఠం నేర్పుతాను," అన్నాడు.

కాని ఈలోపుగానే అహల్యాబాయి తన కొలువులోని కుట్రదారులందరినీ ఎంతో నిపుణంగా పసికట్టి అందరినీ ఖైదు చేయించేసింది. వీరిలో రాఘోబాకూడా ఉన్నాడు.

కొద్దిరోజుల అనంతరం అహల్యా రాఘోబాను బంధవిముక్తుణ్ణిచేసి ఇందోరులో అతిథిగా ఉండనిచ్చింది. ఆమె పరిపాలనా దక్షతనూ, మనుషులను శాసించటంలో ఆమెకు గల సామర్థ్యాన్నీ రాఘోబా కళ్లారా చూసి తెలుసుకున్నాడు. కాని తాను కొద్దికాలం బందీగా ఉండటం జరిగిందన్న అవమానం అతనిని బాధిస్తూనే ఉన్నది.

గంగాధర జస్వంత్ రాణీకి క్షమాపణ చెప్పుకుని, ఆమెచేత క్షమించబడి, ఎప్పటిలాగే రాజపురోహితత్వం కొనసాగించాడు.

మిగిలిన కుట్రదార్లచేత రాజభక్తి ప్రమాణం చేయించుకుని అహల్యాబాయి వారినికూడా విడిచిపుచ్చింది.

రాఘోబామాత్రం తనకు జరిగిన అవమానం మరవలేక రాజపుత్రులను ఇండోర్ రాజ్యంపైకి రెచ్చగొట్టాడని చెబుతారు. అహల్యాబాయి బెదరలేదు. ఆమె తనకు ప్రాణం ఇచ్చేవారినందరినీ కూడగట్టుకున్నది, భోన్స్లా, సింధియా, బరోడా పాలకుల సహాయం అర్థించింది. వారు తమ సైన్యాలతోబాటు తాముకూడా వచ్చారు.

అహల్యాబాయి సేనలకు నాయకుడు తుకోజీ. ఇతను తక్కువ కులంలో పుట్టినవాడైనా యుద్ధంలో చతురుడు. యుద్ధంలో ఇతను రాజపుత్రులను పూర్తిగా ఓడించి పరిగెత్తించాడు.

రాఘోబా కసి తీరనేలేదు. కొంతకాలం పోయాక అయన అహల్యాబాయికి డబ్బు పంపమని కబురుచేశాడు: "నేను డబ్బు ఇబ్బందిలో ఉన్నాను. మీ ఖజానాలో పుష్కలంగా డబ్బున్నట్టున్నది. అందులో కొంత నాకిస్తే మీకు తరుగు రాబోదు, నా అవసరమూ గడుస్తుంది!"

"నా ఖజానాలో ఉన్నదంతా శ్రీకృష్ణుడికి కైంకర్యమై ఉన్నది. ఆ దేవుడిపేర పుణ్యకార్యాలు చెయ్యటానికి తప్ప దానిని విని



యోగించరాదు. మీరు బ్రాహ్మణులు, ఇబ్బందిలో ఉన్న పక్షంలో దానం ఇస్తాను, పరిగ్రహించవచ్చు," అని అహల్యాబాయి జవాబు పంపింది.

"దానమిస్తుందా! నాకు కావలిసినది నేనే పుచ్చుకుంటాను. ఎవరడ్డుతారో చూస్తాను!" అంటూ రాఘోబా ఒక సైన్యాన్ని వెంటతీసుకుని ఇందోర్‌పైకి దాడి వచ్చాడు. అహల్యాబాయి కవచం ధరించి ఆయనకు ఎదురు వెళ్ళింది. ఆమె వెంట అయిదువందలమంది దాసీలుమాత్రం ఉన్నారు—ఒక్క మగవాడుకూడా లేడు. రాఘోబాకు ఇదంతా అయోమయంగా ఉన్నది. "సేనలు ఎక్కడ?" అని ఆయన అహల్యాబాయిని అడిగాడు.

"అనాదిగా పేష్వాలకు సామంతులంగా ఉంటున్న మేము వారితో ఎలా యుద్ధం చేస్తాం? నా బొందెలో ప్రాణం ఉండగా నా ఖజానాలోని రాగిడబ్బుకూడా మిమ్మల్ని అంటనివ్వను. నన్ను చంపి నా సొత్తంతా తీసుకోండి!" అన్నది అహల్యాబాయి.

రాఘోబా జ్ఞానహీనుడు కాడు. ఆయన సిగ్గుతో తల వంచుకుని, వచ్చిన దారినే వెళ్ళిపోయాడు.

కేవలమూ రాజకీయ దక్షతవల్లా, యుద్ధ సామర్థ్యంవల్లా అహల్యాబాయికి కీర్తి



రాలేదు. నిత్యపరిపాలనలో ఆమె అసమాన ప్రతిభ కనబరిచి, తన ప్రజల ఐశ్వర్యాన్ని దినదిన ప్రవర్ధమానం చేసింది. ఆమె రాజ్యానికి వచ్చిన కొత్తలో ఠగ్గులూ, బందిపోటులూ స్వైరవిహారం చేస్తూ ఉండేవారు. ఈ ప్రజా కంటకులను నిర్మూలించిన వీరుడికి తన ఏక పుత్రికనిచ్చి వివాహం చేస్తానని అహల్యాబాయి ప్రకటించింది.

జస్వంతరావు అనే యువక వీరుడు ఆ దుర్ఘటమైన పనిని సాధించి మచ్చాబాయిని వివాహం చేసుకున్నాడు.

తాను ఎంతో శ్రద్ధగా పాత్రులైనవారిని రాజకీయోద్యోగులుగా నియమించినప్పటికీ తాను నియమించిన అధికారులపైన ఏవైనా అభియోగాలు వచ్చినట్టయితే అహల్యాబాయి తానే విచారణ జరిపేది. ప్రజాపీడన అనేది ఆమె తత్వానికి కొంచెం కూడా సరిపడేదికాదు.

ఒకసారి బసియా అనే గ్రామంలో ఒక ధనికుడు చనిపోయాడు. ఆయన భార్యకు అంతులేని ఆస్తి సంక్రమించింది. ఆ ఆస్తికి హక్కుదారుగా ఒక కుర్రవాణ్ణి పెంచుకుందామని ఆవిడ అనుకున్నది, కాని గ్రామాధికారి అడ్డుతగిలి దత్తత వల్ల కాదన్నాడు; ఆ సొత్తంతా ప్రభుత్వ ఖజానాలో చేర్చాలని అతడి ఉద్దేశం. ఈ సంగతి



వినగానే అహల్యాబాయి గ్రామాధికారిని కఠినంగా మందలించి, వితంతువుకు దత్తత తెచ్చుకునే అధికారం ఇచ్చేసింది.

మరొకసందర్భంలో ఇద్దరు ధనికులు చనిపోయారు. వారి భార్యలు జీవితంపై విరక్తి కలిగి అహల్యాబాయి వద్దకు వచ్చి, "మహారాణీ, మా భర్తల సొత్తంతా నీకు అర్పించి మేము తీర్థయాత్రలకు పోదలిచాము," అని విన్నవించుకున్నారు.

"అక్కలారా, మన బాధ్యతలు అంత సులువుగా వదిలేవైతే ఇక లేనిదేమిటి? నాకు ధనానికి ఏలోటూ లేదు, మీ సొత్తు మీవద్దనే ఉంచుకుని దానధర్మాలూ, పుణ్యకార్యాలూ చేసి ప్రజలకు మేలుచెయ్యండి," అన్నది అహల్యాబాయి. వారు ఆమె సలహా ప్రకారం చెరువులు లేనిచోట చెరువులూ, బావులు లేనిచోట బావులూ తవ్వించారు, పేదసాదలకు అన్నసత్రాలు ఏర్పాటు చేయించారు.

అహల్యాబాయి నిరాడంబరజీవి. పనికి మాలిన నగలూ నట్రా ఆమెకు ఇష్టంలేదు. తనకున్న ధనాన్ని సత్కార్యాలకు వినియోగించేది. మతాభిమానం హెచ్చినకొద్దీ దేశం సుభిక్షంగా ఉంటుందన్న విశ్వాసంతో ఆమె ఎన్నో ఆలయాలు కట్టించింది. ఆమె కట్టించిన ఆలయాలన్నిటిలోకీ గొప్పది గయ వద్ద ఉండే విష్ణుపాదాలయం.

అహల్యాబాయి డెభైఏళ్ళు జీవించింది. ఆమెది సుఖమయమైన జీవితం. ఆమెకు కలిగిన ఒకేఒక కష్టం ఏమంటే, ఆమె జీవించి ఉండగానే ఆమె కుమార్తె తన భర్తతోబాటు సహగమనం చేసింది.

మొత్తంమీద అహల్యాబాయిని గురించి జ్యోతిష్కులు చెప్పిన మాటలు నిజమయాయి. ఒక రైతుఇంట పుట్టి ఆమె రాజపత్ని, రాణీ అయి దీర్ఘకాలం పాలించటమే గాక, ఆమె కీర్తి చరిత్రలో శాశ్వతంగా వెలిసింది.






తిరిగే కాలూ తిట్టే నోరూ ఊరికే వుండవు. లిల్లిపుట్ నుండి తిరిగి వచ్చిన రెండు నెలలకే మళ్లీ ఓడ ఎక్కాను. దాని పేరు 'అడ్వెంచర్.'



సూరత్‌కు బయలు దేరాము. కొద్దిరోజులు ప్రయాణం బాగానే సాగినా హఠాత్తుగా తుఫాను విరుచుకు పడింది.



తుఫాను తగ్గేసరికి కొత్త ఇబ్బంది వచ్చింది. ఓడలో మంచి నీళ్లయిపోయాయి. కానీ అంత లోనే భూమి కనబడింది.



మేము పన్నెండుగురము కలిసి ఒక పడవలో ఒడ్డుకి వెళ్లాము. అది ఒక పెద్దద్వీపం. అందరం తలో దారినా నీటికై వెతుకుతూ వెళ్లాము.



ఎంత వెతికినా నీటిజాడ కనిపించక విసుగేసి పడవవేపు మళ్లేసరికి నాతోటి నావికులందరూ హడావుడిగా పడవెక్కి వెళ్లిపోవడం కనబడింది.



'నాకోసం ఆగండోయ్' అని కేక వెయ్యబోయాను. కానీ అక్కడ భయంకరమైన దృశ్యం కనబడింది—నోట మాట రాలేదు.



కొండంత మనిషి పడవని తరుముతున్నాడు. పడవలోని మా బృందం అప్పటికే చాలా దూరం వెళ్లిపోయారు.



వాడు నన్నెక్కడ చూస్తాడోనన్న భయంతో వెనక్కి తిరిగి పొలాల్లోకి జొరబడి పరిగెత్తాను. ఆ పైర్లు ఏకంగా 40 అడుగులు ఎత్తున్నాయి.



నా దురదృష్టంకొద్దీ నేను తలదాచుకున్న పొలంలోనే కోతలు జరుగుతున్నాయి ఒక్కొక్క మనిషి ఏకంగా 80 అడుగుల ఎత్తున్నాడు.



వాళ్ల కొడవళ్లకి అందకుండా వెనక్కి వెనక్కి పరిగెత్తాను. కానీ ఆ మనుషులు ఒకో అంగలో పదేసి గజాల దగ్గరకొచ్చేస్తున్నారు.



ఇహ లాభం లేదనుకుని తల పైకెత్తి గొంతు చించుకుని, శక్తికొద్దీ "ఆగండి, ఆగండి" అని కేకలు పెట్టాను.



నా కేకలు వినబడి నేను కనబడివుండాలి. ఆ కూలీ నన్ను పట్టుకుని తన కామందు దగ్గరకు పరిగెత్తాడు.



కామందు ఓ గడ్డిపరకతో నన్ను పైకెత్తి, వింత పురుగును చూసినట్టు చూశాడు. నాకు తెలిసిన అన్నిభాషల్లో నేనూ మనిషినేనని అరిచాను.



అతనికేం అర్థమైనట్లు లేదు. నన్ను కిందికి మెల్లిగా దించాడు. నేను ముందుకూ వెనక్కీ నడచి నేను పారిపోనని నమ్మకం కలిగించాను.



జేబులోని డబ్బుసంచీ కింద ఒంపి బంగారు నాణేలు ఇవ్వబోయాను. అతను చెమ్కీపొడి అద్దినట్టు వేలితో అద్ది తీసి చూసి వద్దన్నాడు.



తన అరచేతిని నేలమీద ఆనించి చేతిరుమాలు పరిచి నన్నెక్కమన్నాడు. అరచెయ్యి మందం ఒక అడుగే కాబట్టి ఎక్కి కూచున్నాను.



రుమాలు లుంగచుట్టి పదిలంగా ఇంటికి తీసుకువెళ్లి తన భార్యకి చూపాడు. ఆవిడ తేలును చూసినట్లు భయపడింది.



30 అడుగుల ఎత్తు బల్లచుట్టూ కామందు కుటుంబం భోజనాల కూర్చున్నారు. ఒకో పళ్లెం 24 అడుగుల వెడల్పుంది.



ఇంటావిడ రొట్టెముక్క లిచ్చింది. నా జేబు లోంచి కత్తీ ఫోర్కూ తీసి ఆ ముక్కల్ని తిరిగి కోసుకు తింటూంటే వాళ్లంతా నవ్వారు.



హఠాత్తుగా కామందు చిన్నకొడుకు నా ఎడం కాలు పట్టుకుని గబుక్కున తల్లకిందులుగా 60 అడుగుల పైకెత్తాడు.



కామందు గబగబా వచ్చి నన్ను కాపాడి కొడుకుని దండించబోయాడు గానీ నేను అడ్డు పడ్డాను. ఒక చిన్న జెల్లకాయ కొట్టి వదిలేశాడు.



వెనకాల చిన్న గర్జన వినబడింది. చూస్తే అది వాళ్ల పిల్లి! మన ఎద్దుకి మూడు రెట్లుంది. అదృష్టవశాత్తు నా సంగతే పట్టించుకోలే దది.



భోజనాల తరువాత ఇంటావిడ నన్ను పక్కమీద పడుకోపెట్టి తన రుమాలు దుప్పటిగా కప్పింది. నిద్ర లేచి ఎదురుగా చూద్దునుగదా—



# తాబేటి చిప్ప

అయిదువందల ఏళ్ళక్రితం సూచౌ నగరం పడమటి ద్వారం సమీపంలో వెన్ షీ అనే వాడు ఉండేవాడు. అతను అపారమైన తెలివితేటలు గలవాడు. చదరంగమూ, చిత్రకళా, నాట్యమూ, సంగీతమూ, జంత్ర వాద్యాలూ—ఏదిబడితే అది నేర్చుకుని అన్నిటిలోనూ రాణించాడు. అయితే ఎవరో జ్యోతిష్కులు చిన్నతనంలో అతడి చక్రం వేసి, మహా ధనికుడవుతాడని చెప్పటంవల్ల, డబ్బు సంపాదించే ప్రయత్నం ఒక్కటీ చెయ్యక ఉన్నదంతా ఖర్చుపెడుతూ సరదాగా కాలక్షేపం చేశాడు.

త్వరలోనే అతని అస్తి అడుగంటే పరిస్థితి ఏర్పడింది. ఈలోపుగా అతని తోటి వాళ్ళంతా వర్తకం చేసి తమ ఆస్తులను రెండింతలూ, మూడింతలూ చేసుకున్నారు. ఇది చూసి వెన్ తానుకూడా వర్తకంలో వేలుపెట్టాలని యత్నించాడు, కాని అదేం గ్రహచారమో, అతను వ్యాపారం చేసినప్పుడల్లా నష్టం వచ్చింది. స్వతహాగా తెలివితేటలు కలవాడుగనక ఏ వస్తువులకు ఎక్కువ గిరాకీ ఉంటుందో, వాటిని ఏవిధంగా అమ్మితే హెచ్చు ధర వస్తుందో ఎంతో జాగ్రత్తగా ఆలోచించే సరుకు కొనేవాడు. కాని ఆ వస్తువులు తడిసిపోవటమో, తగలబడిపోవటమో జరిగేది. ఈవిధంగా అతనికి ఉన్నదంతా తుడిచిపెట్టుకు పోవటమే గాక, అతనితో భాగస్వాములుగా చేరిన వారి సొమ్ముకూడా నాశనమయింది.

ఒకనాడు నలభైమంది వర్తకులు ఒక ఓడ చేసుకుని సముద్రాలమీద బయలుదేర బోతున్నట్టు విని వెన్ తననుకూడా వారి వెంట తీసుకుపొమ్మన్నాడు. వెన్ సరదాగా కబుర్లు చెప్పి నవ్వించగలడనీ, అటువంటి వాడు వెంట ఉంటే ప్రయాణం విసుగు పుట్టదనీ భావించి వాళ్ళు సరేనన్నారు.

చీనా జానపద కథ



వెన్ ఉద్దేశం దేశాలు చూద్దామనే. అయితే వర్తకుల ప్రముఖుడు చాంగ్ అనే అయన అతనిచేత కూడా కొంత సరుకు కొనిపించి వర్తకం చేయింతామనే ఉద్దేశంతో మిగిలిన వర్తకులను చందాలు వెయ్యమన్నాడు. చందాలు వెయ్యటానికి చాలా మంది ఒప్పలేదు. అందుచేత సుమారు రెండు పలాల వెండి మాత్రమే పోగయింది. చాంగ్ దాన్ని వెన్ కిచ్చి, "ఇది సరుకులు కొనటానికి ఎలాగూ చాలదు. ఏవైనా పళ్ళూ ఫలాలూ కొనుక్కో, దారిపొడుగునా తిన వచ్చు," అన్నాడు. రేవులో కమలాఫలాలు అమ్ముతూంటే వెన్ తన వెండి యావత్తూ వెచ్చించి వచ్చినన్ని కమలాఫలాల బుట్టలు కొన్నాడు. వాటిని చూసి మిగిలిన వర్తకులు హేళనగా నవ్వారు.

ఓడ కొన్నిరోజులు ప్రయాణించేసి ఒక దేశం చేరింది. అక్కడ ఒక రేవు పట్టణంలో ఓడకు లంగరు దించారు. వర్తకులందరూ ఈ దేశం ఎరిగినవారే. చీనా సరుకులు ఈ దేశంలో తొమ్మిది పదింతలు ధరకు అమ్ముతాయి; అలాగే ఈ దేశపు సరుకులు చీనాలో హెచ్చు ధరలకు అమ్ముతాయి. అందుకే ప్రాణాలపైనకూడా ఆశ వదిలి చీనా వర్తకులు ఈ సముద్ర ప్రయాణాలు చేస్తారు. వర్తకులందరూ తమ సరుకులతో దిగివెళ్లాక వెన్‌కు తన కమలాఫలాలు జ్ఞాపకం వచ్చాయి. అందరూ వాటిని చూసి నవ్విన కారణంగా అతను ప్రయాణంలో వాటి ఊసు ఎత్తలేదు. అవి చెడిపోయాయేమోనని చూడటానికి అతను ఇప్పుడు బుట్టలను పైకి తీయించి, ఓడ పైభాగాన దొంతరలుగా అమర్చాడు. పళ్లు బాగానే ఉన్నట్టు కనిపించాయి. అయినా రుచి చూద్దామని అతను ఒక కమలా వొలిచి కొన్ని తొనలు నోట్లో వేసుకున్నాడు.

అంతదాకా రేవులో ఉండేవాళ్లు ఎర్రగా మెరిసే ఈ పళ్ళను వింతగా చూస్తున్నారు.



వాటిని తింటారని వాళ్ళకిప్పుడర్థమయింది. వారిలో ఒకడు ఒక బరువైన వెండి రూపాయి తీసి వెన్ చేతిలో పెట్టి ఒకటి ఇయ్యమని వేలు చూపాడు. వాడు ఒక కమలా తీసుకుని, వెన్ చేసినట్టుగానే తోలు వొలిచి బద్దలు తినటానికి మారుగా పండంతా నోట్లో వేసుకుని నొక్కి రసం తాగి, పిప్పి, గింజలూ, అంతా కలిపి మింగేశాడు. వాడికి దాని రుచి అద్భుతంగా కనిపించింది. వాడు వెన్‌కు మరి పదిరూపాయలిచ్చి పది పళ్ళు పట్టుకుని వెళ్ళిపోయాడు.

ఆ తరవాత కమలాలను కొనటానికి జనం ఎగబడ్డారు. వెన్ తెచ్చిన కమలాలలో సగానికి పైగా అయిపోయినాక, పండుకు రెండేసి రూపాయలు వసూలు చేశాడు.

ఈలోపల మిగిలిన వర్తకులు తిరిగి వచ్చి, వెన్ చేసిన వ్యాపారం గురించి విని, "చాలా అదృష్టవంతుడివి. ఇక్కడి సరుకులు కొనుక్కున్నావంటే చీనాలో చాలా లాభసాటిగా అమ్ముకోవచ్చు," అని సలహా ఇచ్చారు. కాని వెన్ తనకు పట్టవలిసిన అదృష్టమేదో పట్టనే పట్టిందనుకుని తాను సంపాదించుకున్న వెండితో తృప్తిపడ్డాడు.

వర్తకులు తమ సరుకునంతా మారకం వేసుకోవటానికి పదిహేను రోజులు పట్టింది. ఆ తరవాత వారు ఓడలో ఎక్కి మళ్ళీ ప్రయాణం సాగించారు. కొద్ది రోజుల అనంతరం సముద్రంలో బలమైన తుఫానుగాలి సాగి, ఓడ కొట్టుకుపోసాగింది. చివరకు వర్తకులు ఒక నిర్జన ద్వీప ప్రాంతానికి చేరుకుని గాలి తగ్గేదాకా ఓడను అక్కడ లంగరు వేశారు.

వెన్ లంకను చూసి వస్తానని బయలుదేరాడు. "నిర్జనమైన లంకలో చూడటానికేముంటుంది?" అని అందరూ నిరుత్సాహపరిచినా వినక అతను ఒంటరిగా బయలుదేరాడు. లంక మధ్యను అటే ఎత్తు లేని గుట్ట ఒకటి ఉన్నది. కొండమీద పెరిగే

లతల సహాయంతో పాకుతూ వెన్ ఆ గుట్ట పైభాగాన్ని చేరుకున్నాడు. అక్కడినుంచి చూస్తే నలువైపులా అతనికి సముద్రం కనిపించింది. ఇంతలో అతని కన్ను సమీపంలో గడ్డిమధ్య పడి ఉన్న ఒక వింత వస్తువును చూసింది. దగ్గిరికి వెళ్ళి చూస్తే అదొక తాబేటి చిప్ప! అయితే అది చాలా పెద్దది— ఒక మంచం ప్రమాణంలో ఉన్నది. "ఇంతంత తాబేళ్లుకూడా ఉంటాయా?" అని వెన్ ఆశ్చర్యపడ్డాడు. అటువంటి తాబేటి చిప్ప ప్రపంచంలో ఎవరూ చూసి ఉండరు. తాను చూశానంటే ఎవరూ నమ్మరు; "సూచౌ వాళ్లు కోతలరాయుళ్లు!" అంటారు. అదీగాక దీన్ని తన దేశం పట్టుకుపోయి నిలువునా కోయించి, కోళ్లు అమర్చితే రెండు మంచాలవుతాయి! వెన్ ఈ విధంగా అనుకుని ఆ తాబేటి చిప్పకు బట్టకొంగు కట్టి రేవు దగ్గిరికి ఈడ్చుకొచ్చాడు. వర్తకులందరూ దాన్నిచూసి ఆశ్చర్యపడ్డారు; కొందరు దాన్ని చీనా తీసుకుపోవటం మోతచేటు అన్నారు; మరికొందరు వైద్యానికి పనికివస్తుందన్నారు. "మీరందరూ విదేశీ సరుకులు తెచ్చుకుంటున్నారు కారా? ఇది నా విదేశీ సరుకు! డబ్బు దుగ్గాని ఖర్చు కాకుండా వచ్చింది, అంతే తేడా!" అన్నాడు వెన్.



మర్నాడు గాలి విసురు తగ్గింది. ఓడ తిరిగి ప్రయాణం సాగించింది. అది చీనా తీరాన్ని చేరగానే వర్తకుల దళార్లు వచ్చి ఫలాని ఫలాని వర్తకుల వద్దకు రమ్మని ఓడలో వచ్చిన వర్తకులను ఆహ్వానించారు. వెన్, అతని అనుచరులూ ఒక ఇరానీ వర్తకుణ్ణి చూడబోయారు. అతని పేరు అబూ హసన్. ఆయన తన అతిథుల కోసం పెద్ద ఎత్తున విందు ఏర్పాటుచేశాడు.

ఇలాటి విందుల్లో అతిథులను కూచోబెట్టేటప్పుడు ఎక్కువ ఖరీదైన సరుకులు తెచ్చినవాణ్ణి ఉన్నతాసనంపైన కూచోబెట్టి అందరికంటె తక్కువ తెచ్చినవాణ్ణి పంక్తిలో చివర కూచోబెట్టే ఆచారం ఉన్నది. ఆసనాలు నిర్ణయించటానికిగాను ఇరానీ వర్తకుడు అందరి సరుకుల జాబితాలూ తణిఖీ చేశాడు. వెన్ దగ్గిర ఏ జాబితా కూడా లేదు. అందుచేత అతన్ని పంక్తి చివర కూచోబెట్టారు.

మర్నాడు ఇరానీ వర్తకుడు ఓడ వద్దకు సరుకులు చూడవచ్చాడు. ఆయన ఓడ ఎక్కుతూనే పైభాగాన పడి దొర్లే తాబేటి చిప్ప చూసి, నిర్ఘాంతపోయి, "ఈ వెలలేని సామాను ఎవరిది? దీనిని అమ్మరా?" అని అడిగాడు. అది వెన్ సొత్తని మిగిలిన వాళ్ళు చెప్పారు.



ఇరానీ వర్తకుడి ముఖంలో బాధా, కోపమూ కనిపించాయి. "ఇన్నాళ్ళుగా మీరంతా నాతో వ్యాపారం చేస్తూకూడా ఈ పెద్దమనిషి సంగతి దాచిపెట్టి అతనిని విందులో పంక్తి చివర కూచోపెట్టనిచ్చారు. నేను వారికి ముందు క్షమాపణ చెప్పుకోవాలి! మీ సరుకుల సంగతి తరవాత చూస్తాను!" అంటూ ఆయన వెన్‌ను వెంట బెట్టుకుని తీరానికి వెళ్ళాడు.

అబూ హసన్ వెన్‌ను తన దుకాణానికి తీసుకుపోయి కూచోబెట్టి, తిరిగి వచ్చి మిగిలిన వారిని తీసుకుపోయాడు. తరవాత అతను అందరి ఎదటా వెన్‌ను, "ఆ తాబేటి చిప్ప అమ్ముతారా?" అన్నాడు.

వెన్ తెలివి లేనివాడుకాడు, "మంచి ధర వస్తే అమ్మటానికేం?" అన్నాడు.

"అయితే ఎంత ఇమ్మంటారో అడగండి! నేను గిల్లి బేరం ఆడేవాణ్ణికాను!" అన్నాడు అబూ హసన్.

వెన్ చాంగ్‌తో సంప్రతించాడు. వారు రహస్యంగా మాట్లాడుకున్నారు.

చిట్టచివరకు చాంగ్ హసన్‌తో, వేళాకోళంగా అన్నట్టుగా, "అతని ఉద్దేశం పది వేలు అడగాలని ఉన్నట్టున్నది!" అన్నాడు.

"అంటే ఆయనకు అమ్మాలని లేదన్న మాట!" అన్నాడు హసన్.

ఆ తాబేటి చిప్ప చాలా విలవైనదని వర్తకులకు తెలిసిపోయింది. చాంగ్ ఇక దాపరికం లేకుండా హసన్‌కు వెన్ కథ అంతా చెప్పి, ఎంత ఇవ్వాలో హసన్‌నే నిర్ణయించమన్నాడు. హసన్ యాభైవేల పలాల వెండి ఇచ్చి తాబేటి చిప్పను కొన్నాడు. అది కూడా చాలా తక్కువ ధరే. ఆ తాబేటి చిప్పలో వెలలేని ముత్యాలు, అంగుళం ప్రమాణం గలవి ఉంటాయట. ఏమైనా వెన్ దుర్దినాలు దాటిపోయాయి. అతను పెళ్ళాడి, పెద్ద వర్తకులలో ఒకడై సుఖంగా జీవించాడు.






మళ్ళీ పౌర్ణమి వచ్చింది. పిండారబోసినట్టున్న వెన్నెలలో తాతయ్య పడకకుర్చీలో కూచున్నాడు. పిల్లలు ఆయన చుట్టూ కూచున్నారు. తాతయ్య ఏదో ఆలోచించుకుని తనలో తాను నవ్వుకున్నాడు. తరవాత ఈ శ్లోకం చదివాడు:

"మనసా బధ్యతే జీవో,
మనసైవ విముచ్యతే—
దేవదాసో గతో బంధం
వేశ్యాదాసో విమోచితః".

"అంటే ఏమిటి, తాతయ్యా?" అని పిల్లలు అడిగారు.

తాతయ్య వెంటనే జవాబివ్వక రొండి నుంచి పొడుంకాయ తీసి, చిటికెడు పొడుం పట్టి, పెద్ద చప్పుడు చేస్తూ పీల్చి, "ఈ శ్లోకానికి అర్థమేమిటీ అని కదూ అడుగుతున్నారూ? చెబుతా వినండి: 'జీవుడు మనసుచేత బంధించబడి ఉంటాడుసుమా! ఆ మనసువల్లనే మోక్షాన్నికూడా పొందుతాడు! వెనకటికి దేవదాసు అనేవాడు నరకానికి పోగా వేశ్యాదాసు ఏకంగా మోక్షం పొందాడుగదా!' అని," అన్నాడు.

"దేవదాసు ఎవరు, తాతయ్యా....వేశ్యాదాసు మోక్షం ఎందుకు పొందాడు, తాతయ్యా?....ఆ కథ ఏమిటి, తాతయ్యా?" అని పిల్లలు తలా ఒక ప్రశ్న వేశారు.

"ఆ కథ చెప్పమంటారా ఏమిటి? చెబుతాను వినండి మరి!" అన్నాడు తాతయ్య....

అనగా అనగా అవంతీ అని ఒక నగరం. ఆ నగరంలో ఒకే వయసు గల ఇద్దరు బ్రాహ్మణ యువకులుండేవారు. వారిద్దరూ ఎంతో అన్యోన్యంగా ఉండేవారు. అయితే వాళ్ళ నడతలో మట్టుకు చాలా తేడా ఉండేది. ఏమంటారా? ఒకడేమో దైవభక్తిపరుడు, నీతిమంతుడు, ఎప్పుడూ దైవపూజా, జపాలూ చేస్తూండేవాడు, సాయంకాలం



రచన: సి. శేషాద్రి

భజన చేసేవాడు; వాడి ధోరణి చూసి అందరూ వాణ్ణి దేవదాసు అని పిలిచేవారు. ఇక రెండోవాడున్నాడే వాడు ఎప్పుడూ వేశ్యల ఇళ్ళలో ఉంటూ, సుఖాలతో కాలం వెళ్ళబుచ్చేవాడు. ఇకనేం, వాడికి వేశ్యాదాసు అని పేరు పడిపోయింది.

అయిందా? వీళ్ళిద్దరూ పైకి ఇలా ఉన్నప్పటికీ వీళ్ల మనసులెలా ఉండేవని అడగరేం? దేవదాసు ఉన్నాడే, వాడెప్పుడూ తన మనసులో, "ఆహా, ఆ వేశ్యాదాసుగాడు ఎంత సుఖపడిపోతున్నాడు! నాకు ఒక్క సుఖమూ లేదుగదా!" అని కుళ్ళుతూ ఉండేవాడు. ఇక వేశ్యాదాసేమో తన స్నేహితుడు చక్కని పుణ్యజీవితం గడుపుతున్నాడనీ, వాడికి మోక్షం వస్తుందిగదా అనీ లోలోపల అనుకునేవాడు.

ఈ విధంగా వాళ్లు కొంతకాలం జీవించి చనిపోయారు. అప్పుడేమయిందో తెలుసా? యములవాళ్ళు వచ్చి దేవదాసును నరకానికి తీసుకుపోయారు, విష్ణు కింకరులు వచ్చి వేశ్యాదాసును మోక్షానికి తీసుకుపోయారు. "ఇదేమిటీ అన్యాయం? ఆ వేశ్యాదాసుకు మోక్షమూ, నాకు నరకమూనా?" అన్నాడు దేవదాసు.

"ఏంచేస్తాం? నీ మనస్సెప్పుడూ వేశ్యల మీదనే ఉండె; ఆ వేశ్యాదాసు అస్తమానమూ మోక్షం గురించే ఆలోచించేవాడు. ఆత్మశుద్ధి ముఖ్యంగాని చేసే పనులు కావు!" అని జవాబు చెప్పారు యములవాళ్ళు.

అందుకే పెద్దలేమన్నారంటే—

"నకాష్ఠే విద్యతే దేవో,
నపాషాణే, నమృణ్మయే,
భావేతు విద్యతే దేవ
స్తస్మాద్భావోహి కారణమ్

[దేవుడు కర్రలోనూ, రాతిలోనూ, మట్టిలోనూ లేడు సుమా, మన బుద్ధిలోనే ఉన్నాడు. అన్నిటికీ బుద్ధే మూలకారణం!]" అన్నాడు తాతయ్య.



# సాంచీ స్థూపం

భోపాలు నుంచి ఝాన్సీకి వెళ్ళే రైలు దారిలో భోపాలుకు ముప్పైమైళ్ళ లోపు దూరంలో సాంచీ తగులుతుంది. సాంచీ బౌద్ధ శిథిలాలకు ప్రసిద్ధి గన్నది. ఇక్కడ గల బౌద్ధ శిథిలాలు మనదేశంలో మరెక్కడా లేవు. ఇక్కడ గల స్థూపాలకన్న పురాతనమైన కట్టడాలు కూడా మనదేశంలో మరెక్కడా లేవని చెప్పవచ్చు. బుద్ధుడి ప్రధాన శిష్యులైన సారిపుత్త, మొగల్లానుల అస్థికలు ఒక స్థూపంలో ఉంచబడ్డాయి. బ్రిటిషు పాలకులు వాటిని లండను లోని మ్యూజియములలో చాలాకాలం ఉంచి 1949 లో తిరిగి మన పరం చేశారు.

సాంచీలోని మహాస్థూపం ప్రసిద్ధమైనది. దీని వ్యాసం సుమారు 120 అడుగులు, ఎత్తు 54 అడుగులు. దీనిని ఇసుక రాతితో, లోపల డొల్ల లేకుండా, నిర్మించారు. దీని చుట్టూ రాళ్ళు పరిచిన కాలిదారి ఉన్నది. దాని చుట్టూ రాళ్ళతోనే నిర్మించిన అలవ ప్రాకారం ఉన్నది. ఈ ప్రాకారంలో నాలుగు ద్వారాలున్నవి. ఒక్కొక్క ద్వారము ఎత్తు సుమారు 28న్నర అడుగులు. ఈ ద్వారాలపై బౌద్ధ జాతక కథలు విపులంగా చిత్రించి ఉన్నవి. దక్షిణ ద్వారం సమీపాన అశోక ధర్మశాసనం తాలూకు ఖండం ఒకటి నిలిచివున్నది.

సాంచీ స్థూపాన్ని అశోకుడు క్రీ. పూ. 250 లో నిర్మించాడు. దీనిపై గల చెక్కడపు పనితనం విదేశీయుల ప్రశంసలు విరివిగా అందుకున్నది.



స్థల పురాణం: 

# 3. మల్లం

బహుమతిపొందిన వ్యాసం

పూర్వం మనుమసిద్ధి నెల్లూరు పాలించిన కాలంలో ప్రసిద్ధిగన్న యిద్దరు శిల్పులను కాంచీపురము నుండి రావించి, యిచ్చట కొన్ని దేవాలయాలకు ప్రతిమలు చెక్కించారు. నెల్లూరు రంగనాథ దేవాలయం నిర్మించిన పిమ్మట, గూడూరు తాలూకా లోని "మల్లం" అనే గ్రామంలో ఒక సామంత రాజు కుమారస్వామి గుడి కట్టుటకు పునాది వేసి, నెల్లూరునుండి తండ్రి కొడుకులైన ఆ శిల్పులను రప్పించాడు.

కొంతకాలానికి దేవాలయానికి కావలసిన అన్ని అంశములను చెక్కారు. వారి శిల్పకళా నైపుణ్యానికి జనులు ఆశ్చర్యపోయారు. వారిలో చిన్న శిల్పి దేవాలయానికి కావలసిన ప్రతిమల్లో ఏవియు చేయుటకు పాల్గొనక తనే ప్రత్యేకంగా ఒక రాతి రథం నిర్మించాడు. ఆ రథానికి నాలుగు ప్రక్కల నాలుగు చక్రాలు యిరుసుతో సహా రాతితోనే చెక్కి, ముందు నాలుగు గుర్రాలుగూడా రాతితోనే నిర్మించాడు. ఆ చిన్న శిల్పికి కాంచీపురంలో ఒక ప్రేయసి వుండేది. ఆమె కోసం అతను పగలంతా రథం చెక్కడం, రాత్రికి రాత్రి కంచికి పోయి మరల తెల్లవారేసరికి మల్లం గ్రామం వచ్చి, యెప్పటి ప్రకారం రథం పని చేస్తుండేవాడు. ఒకనాడు అతని ప్రియురాలు వాళ్ళు నిర్మించే దేవాలయం చూడాలని చెప్పిందట. దానికి చిన్న శిల్పి "నువ్వు చూడాలంటే, దేవాలయాన్ని ఇక్కడికే రప్పిస్తాను," అని చెప్పి, వెంటనే వచ్చి, రాతి గుర్రాలకు ప్రాణం పోసి, తన మంత్ర బలంతో రథాన్ని మాత్రం కదిలించాడు.

గుర్రాలు సకిలించి గుంజి లాగేసరికి రథానికున్న రాతి గంటలు, గుర్రాలకున్న రాతి మువ్వలు ఊరు అదిరిపోయేలాగు శబ్దించాయి. వెంటనే రథం వున్నచోటునుంచి పదిగజాలు కదిలి వచ్చేసింది. కాని ఈ సంగతి తండ్రి శిల్పికి తప్ప మరెవ్వరికీ అర్థంకాలేదు. ఆయన వెంటనే పరుగున వచ్చి ఆ రాతి గుర్రాల ముందుకాళ్ళు నరికివేసి, కొడుకును ఆ రథం ముందే నిలబెట్టి ఇనుపసీలతో తల పైన కొట్టేశాడు. చిన్న శిల్పి ఆ రాతి రథం ముందే శిలైపోయాడు.

ఈ కథ జరిగి యెన్నో వందల సంవత్సరాలైనా దీనికి నిదర్శనాలు ముందు కాళ్ళు లేని మొండి గుర్రాలు, సగానికి పైగా పాతుకు పోయిన చక్రాలు, దేవాలయాన్ని వదిలి వచ్చి దక్షిణ ముఖంగా పదిగజాల దూరంలో వున్న రథం, రథం ముందు ఆ చిన్న శిల్పి, యిప్పటికీ అలాగే రాయైపోయున్నాయి. ప్రతి సంవత్సరం ఆషాఢ మాసంలో యిచ్చట ఉన్న కుమారస్వామికి పదిరోజులు ఉత్సవం జరుగుతుంది.

మారంరెడ్డి సుందరరామిరెడ్డి, పూనుగుంటపాళెం.

[ బహుమతి మొత్తం రు. 10/– ఈ నెలాఖరులోగా పంపబడుతుంది. ]



"ఏమిట్రా వెతుకుతున్నావూ?"
"ఏం లేదమ్మా!"
"అది కిందివరస రెండో డబ్బాలో ఉందిరా."



"అయితే, డాక్టరుగారూ, ఈ కళ్లజోడు పెట్టుకుంటే చదవగలుగుతానంటారా? ....తమాషాగా ఉందె! నాకు చదవడం ఇంతకుముందు రాదు."



"లాము, లాము! నీకు లాయడం వత్తునా?"
"ఓ, ఇంచక్కా లాత్తాను గాని చదవడం లాదు!"



"చిన్నపిల్లలు అబద్ధాలాడితే ఏమవుతుందో తెలుసా?"
"ఓ, టిక్కెట్టు లేకుండా రైల్లో పోవచ్చు."

చిత్రకారుడు : ఎస్. శంకరనారాయణ

రచన: "రోహిణి"

# రాగిచెంబు కథ

సీతానగరంలో ఒక - శిష్టుడైన బ్రాహ్మణుండు
చీకూ చింతా లేక - జీవయాత్ర చేయుచుండు
ఆ బాపడు చెప్పినదే - అందరికిని వేదముగా
సెబాసని మెచ్చుకొంచు - చేతురు నిర్వాదముగా

*　　　*　　　*

అమావాస్యరోజున సూ - ర్య గ్రహణము వచ్చిందని
ఆ బాపడు నదిలో స్నా - నాదికమును చేయం జని
ఇసుకలోన రాగిచెంబు - నిడి పై నొక లింగముగా
ఇంత యిసుక పోసి లోని - కేగ నీటిలో మునుగా

*　　　*　　　*

అందరు నట్లే చేయా - లను కొని ఆ యిసుకతోను
అందముగా లింగాల - నమర్చి మునిగి రామీద
గట్టుకి వచ్చిన బాపడు - కాంచలేక తన చెంబును
మొట్టమొదటికే వచ్చెను - మోసమంచు రోదించెను.



## ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

1960 నవంబర్ సంచికలో ప్రకటింపబడే ఫోటోలకు నమూనాలు





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ సెప్టెంబర్ నెల 10-వతేదీ లోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:- చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26.

## సెప్టెంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : బాపనయ్య చేతుల్లో నీళ్లు ఎందుకో....

రెండవ ఫోటో : సాయిబయ్య చెవుల్లో వ్రేళ్లు అందుకే—

పంపినవారు : శ్రీనివాసుల హర్షస్వామి S/o యస్. వి. హనుమాచార్యులు,

వేజండ్ల P.O. (వయా) సంగంజాగర్లమూడి, (గుంటూరుజిల్లా.)

బహుమతిమొత్తం రు. 10/- ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.



# ప్రశ్నోత్తరాలు

1. కె. కృష్ణమోహన్, గుంటకల్లు

"చందమామ" అగస్టు సంచికలో "చారుదత్తుడు" భాసనాటక కథను పూర్తిగా ఎందువలన ప్రచురించలేదు?

భాసుడు ఆ నాటకాన్ని పూర్తిచెయ్యలేదు గనక.

2. వెంపల రామకృష్ణారావు, ఉనకరమిల్లి

మహాభారతం కథలో "సారథులను" కూడా చంపుచున్నట్లు చదువుచున్నాము. ఇదేమి రాజనీతి?

ఇది రాజనీతి కాదు "యుద్ధ అవినీతి". హిరోషిమా, నాగసాకీ నగరాలవారు అణువు బాంబులతో బూడిద కావటంలాటిది నీతి అని ఎవరు అనగలరు?

3. పి. భరద్వాజ, పెంటపాడు

అన్నయ్యా, "చందమామ"లో ముద్రించే బొమ్మలు, వాటికి వేసిన రంగులు మరి ఏ పుస్తకములోను వెయ్యరు, కారణమేమి?

"చందమామ"కు గల అంగబలమూ, సాధన సంపత్తీ ఉంటే ఎవరైనా వెయ్యవచ్చు.

4. ఎస్. కాళిదాసు, షాలిమార్

"చందమామ" జన్మదిన సంచిక ఈ సంవత్సరమే ప్రారంభించారా, లేక ఇంతకు మునుపేమైనా....

"చందమామ" జన్మదిన ప్రత్యేక సంచిక ప్రకటించటం ఇదే మొదలు. ఇకనుంచి ఏటా జన్మదిన సంచికా, దీపావళి సంచికా ప్రత్యేక సంచికలుగా ప్రకటించ నిశ్చయించాము.

5. గజ్జెల నాగేశ్వరరావు, ఖమ్మంమెట్టు

ప్రపంచమున అందరికన్న పొట్టివారు ఎవరు? ఏ దేశమున గలరు?

ఆఫ్రికా ఖండపు మధ్యప్రాంతంలో మరుగుజ్జుజాతి వారున్నారు. వీరు నాలుగున్నర అడుగులు మించి ఉండరు. వీరు ఆటవికులు.

6. మయాచారి శ్రీరాములు, ఖిల్లాఘణాపురం

దేవకి గర్భాన పుట్టిన ఎనిమిదిమందిలో కంసుడు కృష్ణుని తప్ప అందర్నీ చంపేశాడంటారు. మరి కృష్ణుడికి సుభద్ర చెల్లెలెలా అవుతుంది?

బలరాముడిలాగే సుభద్రకూడా వసుదేవుడికీ రోహిణికీ పుట్టింది. కృష్ణుడు మాత్రం దేవకి వసుదేవులకు పుట్టాడు. అందుచేత వాళ్లకు తల్లులు వేరుగాని తండ్రి ఒకడే.

7. బైరెడ్డి రామరెడ్డి, పెదవాల్తేరు

"చందమామ"ను చూడగానే కలిగిన ఆనందం మేనమామను చూచినా కలుగదేమి?

హాయిగా కథలూ, కబుర్లూ చెప్పే ఓపిక అందరు మామలకూ ఉంటుందా మరి?

8. బెన్నూరి జనార్దన్‌రావు, హైదరాబాదు

మా అభిమాన పత్రిక "చందమామ"... నెలకు ఎన్ని వేల ప్రతులు అమ్మబడును?

ఆరు భాషలలోనూ కలిసి రెండు లక్షలకు పైగా అమ్ముతున్నది.

9. వి. నాంచారయ్య, మేడూరు

మేము వేయు ప్రశ్నలు "చందమామ"కే సంబంధించి ఉండవలయునా లేక ఇతర విషయములను గూర్చి వేయవచ్చునా?

ఎక్కువమంది పాఠకులు "చందమామ" గురించే తెలుసుకోగోరుతున్నారు. కొద్ది మంది వైజ్ఞానిక సంబంధమైన విషయాలుకూడా అడుగుతారు. రాజకీయ, మత, తాత్విక, సినిమా సంబంధించిన ప్రశ్నలు తప్ప ఏవైనా అడగవచ్చు.

10 మేదహాల్ స్వర్ణలక్ష్మి, అదవాని

ఒకవేళ మేము మద్రాసుకు వస్తే "చందమామ" ఆఫీసు చూడడానికి వీలవుతుందా?

తప్పక వీలవుతుంది. ప్రతిరోజూ ఎంతోమంది ప్రయాణీకులు "చందమామ" ఆఫీసుకు వచ్చి చూసి పోతూనే ఉంటారు.

11. నిసార్ అహ్మద్, శృంగవరపుకోట

మామా, నువ్వింత అందంగా ఎలా తయారయ్యావు?

నీబోటి అల్లుళ్ళ ప్రోత్సాహంతోనే, నిసార్!

# చిత్రకథ





ఒకరోజున దాసూ, వాసూలు వాళ్ళ తోట దగ్గిర గొర్రెలను మేపుతూన్న కుర్రవాడితో మాట్టాడుతూండగా, ఒక కొంటెవాడు పెద్ద కాట్లకుక్కతో అక్కడికి వచ్చి, "మీ టైగర్, నా బిస్కట్ల పొట్లం దొంగిలించుకు వచ్చింది. నా కుక్క ఫిరంగి చేత దాన్ని కరిపిస్తాను," అన్నాడు. కాట్లకుక్క మొరుగుతూ మీదికి రావటం చూస్తూనే "టైగర్" గొర్రెల మందలోకి పారిపోయింది. దానివెంట పడిన కాట్లకుక్కను చూసి రెచ్చిపోయిన రెండు గొర్రెపొటేళ్ళు దాన్ని తల మీదా, నడుంమీదా ఢీకొట్టినై. దానితో కిందపడి కుయ్యోమంటున్న కాట్లకుక్కను చూసి దాసూ, వాసూలూ, గొర్రెలు కాచే కుర్రాడూ కడుపుబ్బ నవ్వుకున్నారు.






**Printed by B. NAGI REDDI at the B. N. K. Press Private Ltd., and Published by B. VENUGOPAL REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'**

దక్షిణ ఇండియా ఆఫీసు: 5/149, బ్రాడ్వే, మద్రాసు-1.

ఆధునిక యంత్ర
పరికరములతోను
సాంకేతిక
నిపుణులతోను
అమరివున్న
బ్రహ్మాండమైన సంస్థ






ఆఫ్‌సెట్టు ప్రింటర్సు

## ప్రసాద్ ప్రాసెస్ ప్రైవేట్ లి. మదరాసు-26

ప్రతినిధి కార్యాలయాలు :

101, పుష్ప కుంజ్ ఎ, రోడ్డ్, చర్చిగేట్, బొంబాయి-1. (ఫోన్: 243229)

డి/11, 5 మెయిన్ రోడ్, గాంధినగర్, బెంగళూరు-9. (ఫోన్: 6555)

# సెప్టెంబరు 9 విడుదల!




# జిల్లారాయుడు

దర్శకత్వం
తాపీ చాణక్య







నిర్మాత
పి.గంగాధరరావు

ఆంధ్ర: ప్రీమియర్ ఫిలిమ్స్ ప్రై లిమిటెడ్ • సీడెడ్: బాస్కర్ పిక్చర్ గుంతకల్ • నైజాం: వాణీ ఫిలిమ్స్ సికింద్రాబాద్ • మైసూర్: విక్రమ్ పిక్చర్స్ బెంగుళూరు

Photo by Pranlal K. Patel



బహుమతి
పొందిన వ్యాఖ్య

సాయిబయ్యే చెవుల్లో వ్రేళ్లు అందుకే—

పంపినవారు:
S. H. స్వామి - వెజండ్ల

